Hazrath Umar Farooq-e-Azam (R)
(Telugu)

ప్రియప్రవక్త (సఅసం) వారి నలుగురు ఆప్త మిత్రులు

2వ భాగం

# హజ్రత్ ఉమర్ ఫారూఖ్ - యె - ఆజం

(రజి అల్లాహు అన్హు)

మూలం:
**ఇర్ఫాన్ ఖలీలి**

అనువాదం:
**అబ్బాదుల్లా**

قَالَ النَّبِيُّ صَلَّى اللّٰه عَلَيْهِ وَسَلَّمْ :

# لَوْكَانَ بَعْدِيْ نَبِيًّا لَكَانَ عُمَرُ

(ترمذی)

"నా తరువాత ఎవరైనా దైవప్రవక్త అయి ఉంటే నిశ్చయంగా ఉమరిబ్నె ఖత్తాబ్ అయివుంటారు."

(తిర్మిజి)

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# హజ్రత్ ఉమర్ ఫారూఖ్ - యె - ఆజం

## (రజి అల్లాహు అన్‌హు)

## పేరు - వంశం

ప్రియప్రవక్త (సఅసం) గారి రెండవ ఖలీఫా అసలు పేరు ఉమర్ (రజి). కునియత్ (తండ్రి తనయుల సంబంధంతో పిలువబడే పేరు) అబూ హఫస్. బిరుదు ఫారూఖ్-యె-ఆజం. ఫారూఖ్ అంటే మంచి చెడుల మధ్య విచక్షణ చేసేవాడని అర్థం. ఆజం అంటే ప్రధాన వ్యక్తి.

ఈయన తండ్రి పేరు ఖత్తాబ్. ఖత్తాబ్ తండ్రి పేరు నఫీత ఇబ్నుల్ ఉజా. హజ్రత్ ఉమర్ (రజి) తల్లిపేరు ఖన్తమ. ఈమెగారు హష్షాప్ ఇబ్నె ముగైరాగారి కుమార్తె. హజ్రత్ ఉమర్ (రజి) గారు 'బనూఅది' అనే తెగకు చెందినవారు. ఈయనగారి వెనుకటి ఎనిమిదవ వంశం ప్రియప్రవక్త(సఅసం) వంశంతో కలుస్తుంది. అంటే హజ్రత్ ఉమర్ (రజి), ప్రియప్రవక్త (సఅసం)వారు ఒకే వంశానికి చెందినవారన్నమాట.

హజ్రత్ ఉమర్ (రజి) గారి తండ్రి 'బనూఅది' తెగకు నాయకుడు. ఖురైషులు ఆయన్ను ఎంతగానో గౌరవించేవారు. తెగవారి మధ్య ఏవైనా తగాదాలు, విభేదాలు ఉంటే వాటిని పరిష్కార నిమిత్తం ఖత్తాబ్ వద్దకు పంపేవారు.

## జననం - బాల్యం

హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) క్రీ.శ. 582లో మక్కా నగరంలో జన్మించారు. ఆయన పుట్టుక వల్ల కుటుంబీకులకు అమితమైన ఆనందం కలిగింది. ఈయన వయస్సులో ప్రియప్రవక్త (సఅసం)కు పదకొండున్నర సంవత్సరాలు చిన్నవారు.

అరబ్బులు ఒంటెలను మేపేవారు. వారి సంస్కృతి ప్రకారం హజ్రత్ ఉమర్ (రజి) కూడ ఒంటెలు కాశారు. ఆయన తండ్రి మనస్తత్వం కఠినంగ ఉండేది. ఆయన తన కొడుకుల పట్ల కూడ కఠినంగ వ్యవహరించే వారు. హజ్రత్ ఉమర్ (రజి) ఒంటెలను కాస్తూ అలసిపోయేవారు. కొద్దిగ విశ్రాంతి కోసం కూర్చునేవారు. అందుకు తండ్రి ఆయన్ని మందలించేవారు. కొట్టేవారు కూడా. తండ్రి తన పట్ల కఠినంగ వ్యవహరించడం వల్ల ఒక ప్రయోజనం ఈయనకు కలిగింది. అదేమిటంటే హజ్రత్ ఉమర్ (రజి) అలసటలేని కష్టజీవిగా తయారయ్యారు. ఈయన జీవితంలో సోమరితనంగాని, నిర్లక్ష వైఖరిగాని కనబడదు.

ఈయనకు బాల్యం నుండే కుస్తీ పట్ల చాలా ఆసక్తి. వ్యాయామశాలకు వెళ్ళి కుస్తీ పట్లు నేర్చుకొని మల్లయుద్ధ ప్రవీణులయ్యారు కూడ.

# యౌవనంలో ఆటల పోటీలు

హజ్రత్ ఉమర్ (రజి) యౌవనానికి వచ్చారు. వ్రాయడం చదవడం నేర్చారు. అనతికాలంలోనే విద్యాధికులయ్యారు. ఆ కాలం ఖురైష్ తెగవారిలో కేవలం పదిహేడు లేదా పదునెనిమిది మంది మాత్రమే వ్రాత నేర్చిన వారుండేవారు. వారిలో హజ్రత్ ఉమర్ (రజి) ఒకరు. ఉపన్యసించడంలో కూడా ఆయన మంచి వక్తగా పేరు సంపాదించారు.

జబల్-యె-అర్ఫాత్ వద్ద 'ఉకాజ్' ఒక ప్రదేశం ఉండేది. అక్కడ ప్రతి ఏటా ఒక జాతర జరిగేది. ఆ జాతరకు విభిన్న రంగాలకు చెందిన అనేకమంది ప్రవీణులు వచ్చి తమ విద్యా ప్రతిభా ప్రావిణ్యాలను ప్రదర్శించేవారు. హజ్రత్ ఉమర్ (రజి) ఆ జాతరకు వెళ్ళేవారు, వక్తృత్వ పోటీలలో పాల్గొని విజయభేరి మ్రోగించేవారు. కుస్తీల సంగతి వేరే చెప్పనవసరం లేదు. ఈ రంగంలో ఆయన ముందు ఎవరు నిలిచేవారు కాదు. గుర్రపు స్వారిలో కూడా ఆయన ఆరితేరిన రౌతుగా రాణించారు. ఈ పోటీలో కూడా ఎప్పుడూ ఆయనదే గెలుపు. జీనులేని గుఱ్ఱంపై కూర్చొని వందల మైళ్ళు సవారి చేసేవారు; అయినప్పటికీ ఏమాత్రం అలసట చెందేవారు కాదు.

ఒక్క మాటలో చెప్పాలంటే అన్ని రంగాలలోనూ ఆయన సాటిలేని మేటి. అల్లాహ్ ఆయన హోదాలను మరింత ఉన్నతం చేయుగాక!

## వ్యాపారం కూడా చేశారు

మక్కా నగరవాసులు ఎక్కువగా వ్యాపారం చేసేవారు. అందువల్ల హజరత్ ఉమర్ (రజ) తన భృతి కోసం వ్యాపార వృత్తినే చేపట్టారు. కాని తండ్రి నుండి సంక్రమించిన కఠిన స్వభావం వల్ల వ్యాపారంలో ఆయన అంతగ రాణించలేదు. వ్యాపార పనులపై దూరదూర ప్రాంతాలకు ప్రయాణం చేశారు. ఏ దేశం వెళ్ళినా అక్కడి ప్రముఖులను కలిసి విభిన్న విషయాల్ని గురించి సంప్రదించేవారు. ముఖ్యంగ అక్కడి ప్రజల సంస్కృతి, వారి జీవిత విధానాలు చక్కగ తెలుసుకొనేవారు. క్రయవిక్రయాలలో నిజాయితీగా వ్యవహరించేవారు. విషయాలు సుళువుగా అర్థం చేసుకునే మనస్థత్వం, వివేచన, అనుభవం, విశాల దృక్పథం కలవారు. ఏ పనైనా సరే అందులోని బాగోగులు లోతుగ తరచి తెలుసుకొనే దక్షత ఆయనలో ఉంది. క్లిష్ట సమస్యలను కూడ సునాయాసంగ పరిష్కరించేవారు. ఈ సుగుణాలవల్ల ఆయనకు జీవితంలో ఎన్నో మేళ్ళు కలిగాయి.

## ఇస్లాం పట్ల శత్రుత్వం

హజ్రత్ ఉమర్ (రజి) నిండు యౌవనంతో తొణికిసలాడుతూ 23వ యేటలో ప్రవేశించారు. అప్పుడు మక్కా పట్టణంలో ఇస్లామీయ ఉద్యమం సాగుతుంది. ప్రియప్రవక్త (సఅసం) ఏకేశ్వరోపాసనం వైపు పిలుపునిస్తున్నారు. ఉమర్ (రజి) తన తాతముత్తాతల సంప్రదాయాలకు వ్యతిరేకంగ ఒక్క మాట కూడా వినడానికి సిద్ధంగా లేరు. అందువల్ల ఆయన ఈ నూతన ఉద్యమాన్ని తిరస్కరించి దానికి వ్యతిరేకంగ నిలిచారు. ఎవరైన ముస్లిం అయ్యారని వినగానే అతని వెంటపడి బాధలు పెట్టేవారు, కష్టాలపాలు చేసేవారు.

ఒక రోజు ఆయన ఒక బానిసమహిళ ఇస్లాం స్వీకరించిన నేరానికి ఆమె వీపు బద్దలయ్యేట్లు చితకబాదసాగారు. దానికి ముందు ఆయన నానా

మాటలు అంటూ ఇస్లాంను వదిలెయ్యమని చెప్పారు. కాని ఆమె ఇస్లాంను వదలడానికి ఏమాత్రం సిద్ధంకాలేదు. దాంతో ఉమర్ (రజి) ఆమెను చితక బాదడం మొదలెట్టారు. పాపం ఆ అభాగ్యురాలు దెబ్బలు సహించిందికాని ఇస్లాంను వదలుకోలేకపోయింది. ఉమర్ (రజి) అలా కొడుతూ కొడుతూ అలసిపోయారు. కొట్టడం ఆపి "నేను నిన్ను వదిలేశానని భావించకు, కొద్దిగ ఆగు నీ పని మళ్ళీ పడతా" అన్నారు. అంతలో హజ్రత్ అబూబకర్ (రజి) అటుగా వచ్చారు. బానిసస్త్రీ పడే బాధలు చూడలేకపోయారు. ఆయన గుండె కరిగిపోయింది. వెంటనే ఆయన ఉమర్ (రజి)కు డబ్బు చెల్లించి ఆమెను బానిసత్వం నుండి విముక్తం చేశారు. ఈ విధంగా అల్లాహ్ ఆమె ప్రాణాన్ని కాపాడాడు.

## ప్రియప్రవక్త (సఅసం) చేసిన దుఆ

హజ్రత్ ఉమర్ (రజి) ఇస్లాంను వ్యతిరేకిస్తున్నారు. రోజురోజుకు ఆ విరోధం ముదురుతోంది. ముస్లింలను బాధించడం ఆయన ప్రవృత్తిగా మారింది. సరికొత్త పద్ధతులు, భరించనలవికాని బాధలు. కాని విధి నిర్ణయం ఊహించలేనిది. బాధితులు లేశమంత కూడా లెక్కచేయకుండా ఇస్లాంను అనుసరిస్తున్నారు. తుదిశ్వాస దాకా ఇస్లాంను అంటిపెట్టుకొని ఉండాలనేది వారి నిశ్చయం. ప్రతి ముస్లిం తాను దృఢవిశ్వాసి అని ప్రకటిస్తూ వచ్చాడు. వారి ధైర్య సాహసాలు చూసి హజ్రత్ ఉమర్ (రజి) మరింత రెచ్చిపోయారు.

సహచరుల స్థితిగతులు చూసిన ప్రియప్రవక్త (సఅసం)కు జాలి వేసింది. కాని మార్గాంతరం లేకపోయింది. ఆయన మాట వినేవారేలేరు. ఆయన తన ఆవేదనను ఒక్క అల్లాహ్‌కు తప్ప మరెవరికి వినిపించగలరు? అల్లాహ్‌ను ప్రార్థించి ముస్లింలకు సహాయపడమని వేడుకునేవారు. అబూజహల్, ఉమర్(రజి)ల మితిమీరిన హింసాదౌర్జన్యాలతో ముస్లింలు విపరీతమైన బాధలకు గురవుతున్నారు. చివరకు ప్రియప్రవక్త ఇలా దుఆ చేశారు: "ఓ అల్లాహ్! ఉమర్ ఇబ్నె హిషామ్ (అబూజెహల్) లేదా ఉమర్ ఇబ్నె ఖత్తాబ్ ద్వార ఇస్లాంకు గౌరవప్రతిష్టలు చేకూర్చు"

## చివరకు ప్రార్థన ఫలించింది

ప్రియప్రవక్త (సఅసం) ఇస్లాం ప్రచారం చేస్తూనే ఉన్నారు. ఇలా ఆరేళ్ళు గడిచాయి. దైవధర్మం నెమ్మదిగ వేళ్ళూనుతూ నలుదిశలా వ్యాపిస్తోంది. దీన్ని గమనించిన మక్కా నాయకులకు పిచ్చెక్కినట్లయింది. ఒక రోజు వారందరు సమావేశమయి ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలిచ్చారు. అందరి అభిప్రాయం ఒక్కటే. "ముహమ్మద్ (సఅసం)ను చంపనంతవరకు మక్కావాసుల జీవితంలో ప్రశాంతత ఉండదు". ప్రజలందరు ఉపన్యాసాలను చెవిఒగ్గి విన్నారు. నిజమేనంటు తలలూపారు. కాని ఈ పని చేసేందుకు ఎవరు సిద్ధంగా ఉన్నారని విచారిస్తే జనం మూగబోయారు. అందరికి పాము కాటేసినట్లయింది. ఆ సమావేశంలో ఉమర్ ఇబ్నె ఖత్తాబ్ కూడ ఉన్నారు. సభికులలో అలుముకొన్న పిరికితనం చూడగానే ఆయనకు ఆవేశం వచ్చింది. చివాలున లేచి తళతళ మెరుస్తున్న కరవాలం చేతబట్టి ప్రతిజ్ఞ పూనారు: "నేను ముహమ్మద్ (సఅసం)ను చంపేస్తాను" (అల్లాహ్ క్షమించుగాక) గంభీరమైన ఈ మాటలు విని అబూజహలు, (ఈయన ఉమర్ (రజి)కు మామ కావాలి) ఉమర్ (రజి) వెన్నుతట్టుతూ 'షెభాష్ ఉమర్! నీవే ఈ పనికి యోగ్యుడవని నాకు తెలుసు. నీవు ఈ పనిలో కృతార్థుడవయ్యావంటే నీకు నూరు ఒంటెలు, నలభైవేల దీనార్లు పారితోషకంగా ఇస్తాం" అని అన్నాడు. ఆ తరువాత ఉమర్ (రజి) ఒర నుండి తీసిన ఖడ్గాన్ని అలాగే పట్టుకొని ప్రియప్రవక్త (సఅసం) ఇంటి వైపు బయలుదేరారు.

## దుఆ ప్రభావం

ఉమరిబ్నె ఖత్తాబ్ (రజి) కోపావేశాలతో దారీతెన్నూ చూడకుండా చరచరా నడచి వెళ్తున్నారు. దారిలో నయీమ్ ఇబ్నె అబ్దుల్లాహ్ (రజి) ఎదురయ్యారు.

అడిగారు ఆయన: "ఉమర్! అంతా క్షేమమేనా? ఎక్కడికి వెళ్తున్నావు?"

ఉమర్ (రజి) అన్నారు: "ముహమ్మద్ (సఅసం) సంగతి అటో ఇటో తేల్చడానికి వెళ్తున్నా."

నయీమ్ (రజి) ఓ క్షణం ఆలోచించి ఇలా అన్నారు: "మొదట నీ ఇంటి సంగతి తేల్చుకో. నీ చెల్లెలు, బావగారు ముస్లింలయ్యారు కదా!"

ఈ మాట వినగానే ఉమర్ (రజి) మరింత కోపోద్రిక్తులై వెనక్కి తిరిగి చెల్లెలి ఇంటికి వెళ్ళారు. అక్కడ భార్యాభర్తలిరువురు దివ్యఖుర్‌ఆన్ పఠిస్తున్నారు. అన్నను చూడగానే చెల్లెలు ఖుర్‌ఆన్ పత్రాలను దాచేసింది. ఇంటిలో కాలుపెట్టుతూ హజరత్ ఉమర్ (రజి) "మీరిద్దరు ముస్లింలయ్యారని తెలిసింది" అని గర్జించారు. ఆ తరువాత జవాబుకోసం కూడ ఎదురుచూడ కుండా ఇద్దరిని పిడికిళ్ళతో కొట్టడం ప్రారంభించారు. దాంతో వారిరువురు రక్తసిక్తమయ్యారు. చివరికి చెల్లెలికి కూడా ఉక్రోషం వచ్చింది. "ఉమర్! నీవు మమ్మల్ని చంపేసినా సరే, మా హృదయంలో నాటుకుపోయిన ఇస్లాం బయటికి పోయే ప్రసక్తే లేదు" అన్నారు ఆమె. చెల్లెలి నోట వెలువడిన ఈ మాట ఉమర్ (రజి) మీద పిడుగులా పడింది. ఎత్తిన చెయ్యి ఠక్కున ఆగింది. ఆయన చెల్లెలి వైపు ఓసారి ప్రేమగా చూశారు. ఆమె శరీరం నుండి రక్తం కారుతోంది. ఈ దృశ్యం చూడగానే ఆయన కోపం చల్లారింది. "ఇప్పుడు మీరేం చదువుతున్నారు? కాస్త చూపండి నాకు" అన్నారు ఆయన.

చెల్లెలు ఖుర్‌ఆన్ పత్రాలను ఉమర్ (రజి) ముందు పెట్టింది. ఆయన చదవనారంభించారు. చదువుతూ ముందుకు వెళ్ళిన కొద్ది ఆయన ముఖ కవళికలు మారసాగాయి. కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. పెదవులు కంపించాయి. "ఇందులో ఎన్ని మంచి మాటలు ఉన్నాయి!" అన్నారు ఆయన. ఇదీ ప్రియప్రవక్త (సఅసం) చేసిన దుఆ ప్రభావం.

## అల్లాహు అక్బర్

హజ్రత్ ఉమర్ (రజి) చెల్లెలి ఇంటి నుండి నేరుగ అర్ఖం ఇంటికి వెళ్ళారు. ఆ ఇల్లు సఫా కొండ సమీపాన ఉంది. ప్రియప్రవక్త (సఅసం), ఆయన అనుచరులు మక్కా బహుదైవారాధకుల దౌర్జన్యకాండ భరించలేక అర్ఖం ఇంట్లో ఆశ్రయం పొందారు. ఉమర్ (రజి) ఒరలేని కరవాలంతో రావడం చూసి ముస్లింలు భయపడ్డారు. హజ్రత్ హమ్జా (రజి) లేచి నిలబడి "రానివ్వండి.

సదుద్దేశంతో వస్తే సంతోషకరమైన విషయమే. దురుద్దేశంతో వస్తే మాత్రం అతని ఖడ్గంతోనే అతని తలను ఒక్క వ్రేటున ఖండిస్తాను" అన్నారు.

ఉమర్ (రజి) వచ్చి తలుపు తట్టారు. ముస్లింలు తలుపు తెరిచారు. ప్రియప్రవక్త (సఅసం) ముందుకు వచ్చి "ఏమిటి ఉమర్! ఏ ఉద్దేశంతో వచ్చావు ఇక్కడికి?" అని అడిగారు. గంభీరమైన ఈ పదజాలం విని ఉమర్ (రజి) కంపించిపోయారు. ఆయన గద్గద స్వరంతో "ఇస్లాం స్వీకరించడానికి వచ్చాను" అని అన్నారు.

ఈ మాట వినగానే ప్రియప్రవక్త (సఅసం) "అల్లాహు అక్బర్" అన్నారు అప్రయత్నంగా. ఆ వెనువెంటనే సహచరులు కూడా పెద్దపెట్టున అల్లాహు అక్బర్ అని నినదించారు. ఈ నినాదంతో మక్కా కొండలు మార్మోగిపోయాయి. ముస్లింలలో సంతోషం పరవళ్ళు తొక్కింది.

## ఫారూఖ్ బిరుదు

ఇంతవరకు ముస్లింలు ఎవరి కంటబడకుండ రహస్యంగా నమాజు చేసేవారు. హజ్రత్ ఉమర్ (రజి) ఇస్లాం స్వీకరించిన తరువాత ప్రియప్రవక్త (సఅసం)తో "మనం సత్యధర్మాన్ని ఆశ్రయించాం. ఇలా దాక్కొని రహస్యంగా నమాజు చేయడం ఎందుకు? కాబాగృహానికి వెళ్ళి బహిరంగంగా ఎందుకు నమాజు చేయకూడదు?" అని అన్నారు.

ప్రియప్రవక్త (సఅసం) హజ్రత్ ఉమర్ (రజి) సూచనను అంగీకరించారు. ముస్లిందరు 'కాబ'కు బయలుదేరారు. అందరికంటె ముందు ప్రియప్రవక్త (సఅసం) నడుస్తున్నారు. ఆయనకు కుడివైపు హజ్రత్ ఉమర్ (రజి), ఎడమవైపు హజ్రత్ హమ్జా (రజి) నడుస్తున్నారు. వీరిరువురి చేతుల్లో కరవాలాలున్నాయి. 'కాబా'గృహానికి చేరుకోగానే హజ్రత్ ఉమర్ (రజి) తాను ముస్లిం అయ్యానని ఖురైష్ నాయకుల ముందు ప్రకటించారు. ఆ తరువాత "మేమిక్కడ నమాజు చేయడానికి వచ్చాం. ఎవరైతే తమ సంతానాన్ని అనాథలుగా, తమ భార్యల్ని వితంతువులుగా చేయదలచుకున్నారో వారు మమ్మల్ని అడ్డుకో వచ్చు" అన్నారు బిగ్గరగా.

ఈ మాటలు వినగానే అక్కడి బహుదైవారాధకులకు పాముకాటేసి నట్టయింది. మౌనప్రేక్షకులుగ చూస్తూ ఉండిపోయారు. ముస్లింలు ప్రశాంతంగ నమాజు చేసుకొని తిరిగి వెళ్ళిపోయారు.

ఈ సంఘటన వల్ల ప్రియప్రవక్త (సఅసం) సంతోషించి హజ్రత్ ఉమర్ (రజి)కు ఫారూఖ్ అనే బిరుదునిచ్చారు. అంటే సత్యాసత్యాలను, ధర్మాధర్మాలను వేరుపరుచేవారని అర్థం. చూశారా! హజ్రత్ ఉమర్ (రజి) ఎంత ధైర్యశౌర్యాలు కలవారో! అల్లాహ్ ఆయన పట్ల ప్రసన్నుడవుగాక!

## హిజ్రత్

ముస్లిం అయిన కారణంగా హజ్రత్ ఉమర్ (రజి) కూడా బహుదైవా రాధకుల దౌర్జన్యానికి గురికావలసి వచ్చింది. ఆయన ఓర్పు వహించారు. అవిశ్వాసులు ముస్లింలను హింసించడంలో ఏమాత్రం వెనుకాడడం లేదు. చివరకు ముస్లింలను మదీనాకు వలస పోవలసిందిగా అల్లాహ్ అనుమతించాడు. ప్రియప్రవక్త (సఅసం) దైవాదేశాన్ని ప్రియసహచరులకు వినిపించారు, ఒక్కొక్కరు, ఇద్దరిద్దరు చొప్పున రహస్యంగా మదీనాకు వలస వెళ్ళండని చెప్పారు. ఆ తరువాత ఆయన(సఅసం) కూడా వస్తానని చెప్పారు.

దైవప్రవక్త (సఅసం) అనుమతి లభించగానే అనుచరులు ఎలాంటి ఆర్భాటం లేకుండా రహస్యంగా మదీనా వలసపోవడం ప్రారంభించారు. ఇక హజ్రత్ ఉమర్ (రజి) వంతు వచ్చింది. ఆయన రహస్యంగా ఎవరికి తెలియకుండ వలస వెళ్ళే మనిషి కాదు. అలా చెయ్యడం ఆయన మనస్తత్వానికి విరుద్ధం. ఆయన ముందుగా 'కాబా'కు వెళ్ళారు. అక్కడ కాబా చుట్టూ ప్రదక్షిణ చేశారు. నమాజు కూడా చేశారు. తరువాత బహుదైవారాధకులను చూస్తూ, "ఖురైషులారా! నేను మీ పట్టణం నుండి వెళ్తున్నాను. నా వెంట నా సోదరుడు, అతని కుమారుడు, అల్లుడు మరియు స్నేహితులున్నారు. మీలో ధైర్యం ఉంటే నన్ను అడ్డుకొని చూడండి!" అని అన్నారు.

అందరూ కళ్ళప్పగించి ఉమర్ (రజి)ని చూస్తూ నిలబడటం తప్ప ఏమీ చేయలేక పోయారు. ఆయన్ను అడ్డుకునే ధైర్యం ఎవరిలోనూ లేదు. హజ్రత్

ఉమర్ (రజి) వారి మధ్య నుండే వారి వరుసలను చీల్చుకుంటు మదీన వైపు ప్రయాణమయ్యారు. కొన్నాళ్ళ తరువాత ప్రియప్రవక్త కూడా మదీనా వలస వెళ్లారు.

## అజాన్ పిలుపు

ప్రియప్రవక్త (సఅసం) మదీన వచ్చారు. అక్కడ ఒక రోజు ఒక సమస్య వచ్చింది. నమాజు కోసం ముస్లింలను ఏ విధంగ మసీదులో సమీకరించాలి? ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగ అభిప్రాయం వెలిబుచ్చారు. కొందరు డమరు మ్రోగించమని అన్నారు. మరికొందరు ఎత్తుప్రదేశంలో మంట రాజేయాలి అన్నారు. చివరకు హజ్రత్ ఉమర్(రజి) తన అభిప్రాయం వ్యక్తపరుస్తూ నమాజు వేళ కాగానే మనలో ఎవరైన ఒకరు ఎలుగెత్తి బిగ్గరగా ముస్లింలను నమాజు కోసం పిలవాలన్నారు. ఈ సూచన ప్రియప్రవక్త (సఅసం)కు నచ్చింది. ఆ పిమ్మట హజ్రత్ ఉమర్ (రజి) అన్నారు: "నేను రాత్రి ఒక కల గన్నాను. కలలో ఒక వ్యక్తి ఇలా పిలుస్తున్నాడు. 'అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్.......' ఈ మాటలే ఈనాడు మనం అజాన్‌లో ఉపయోగిస్తున్నాం.

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) హజ్రత్ బిలాల్ (రజి)ని పిలిచి ఆ మాటల్నే ఉచ్చరిస్తూ 'అజాన్' ఇవ్వమన్నారు. ఆనాటి నుండి నేటివరకు ఈ పద్ధతినే ఉపయోగిస్తూ నమాజుకు పిలుపు ఇవ్వబడుతోంది. ప్రపంచమున్నంత వరకు ఇలాగే నమాజు పిలుపు ఉంటుంది.

## ప్రవక్త (సఅసం) పట్ల ప్రేమ

ఇస్లాం స్వీకరింపక ముందు హజ్రత్ ఉమర్ (రజి) ఇస్లాంకు ఎంత వ్యతిరేకంగ ఉన్నారో ముస్లిం అయ్యాక దానిపట్ల అంతకంటే ఎక్కువ ప్రేమ కలిగి ఉన్నారు. ఇస్లాం సేవ కోసం ఆయన సమస్తం ధారపోసేవారు. ధన ప్రాణాలు సైతం త్యాగం చేసేందుకు సిద్ధమయ్యేవారు..

దైవధర్మ వ్యాప్తి కోసం ధనం అవసరమైతే పరమ సంతోషంతో డబ్బు ఖర్చు చేసేవారు. ప్రియప్రవక్త (సఅసం) కాలంలో జరిగిన యుద్ధాలన్నిటిలోనూ

ఆయన (రజి) పాల్గొని అవిశ్వాసులతో పోరాడారు. ఇస్లాం కోసం ఆయన తన ప్రాణాన్ని అర్పించడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు.

ఆలోచించండి. ఒకప్పుడు, ఇస్లాం స్వీకరించకమునుపు, ఒర నుండి ఖడ్గం దూసి దైవప్రవక్త (సఅసం) ప్రాణాలు తీయడానికి సైతం ప్రయత్నించారు. (అల్లాహ్ క్షమించుగాక!) ఆ తరువాత ఇస్లాం స్వీకరించి ఆ మహనీయుని కోసం తన ప్రాణాలే సమర్పించేందుకు సిద్ధంగ ఉన్నారు, ప్రియప్రవక్తకు ఒక ముల్లు గుచ్చుకుంటే కూడా భరించలేనంతటి దృఢవిశ్వాసి అయ్యారు.

అవిశ్వాసుల్లో ఎవరైనా ప్రియప్రవక్త (సఅసం)ను హేళనచేస్తూ మాట్లాడితే ఉమర్ (రజి) కోపోద్రేకాలతో ఊగిపోతూ ఆ దుర్మార్గుడ్ని హతమార్చడానికి సిద్ధమయ్యేవారు. చూశారా! దైవప్రవక్త (సఅసం) అంటే హజ్రత్ ఉమర్ (రజి)కు ఎంత ప్రేమ ఉందో.

## మనసులోని కోరిక నెరవేరింది

హజ్రత్ ఉమర్ (రజి)కు ఒక కూతురుంది. ఆమె పేరు హఫ్సా (రజి). ఆయనకు కుమార్తె పట్ల ఎనలేని ప్రేమ. అందువల్లనే ఆయన తన కునియత్ (తండ్రి కుమార్తెల సంబంధం వల్ల) అబూ హఫ్సా అని పెట్టుకొన్నారు. హజ్రత్ హఫ్సా (రజి) వివాహం మొదట హజ్రత్ ఖనైస్ ఇబ్నె హజాఫ (రజి)తో అయింది. ఆయన కూడా ప్రియప్రవక్త సహచరులలో ఒకరు. హజ్రత్ ఉమర్ (రజి)తో బాటు హిజ్రత్ చేసి మదీన వచ్చారు. ఉహద్ యుద్ధంలో పాల్గొన్నారు. అశేష ధైర్యసాహసాలతో పోరాడారు. చివరికి ఆ యుద్ధంలోనే అమరగతులయ్యారు. ఆ విధంగా హజ్రత్ హఫ్సా (రజి) వితంతువు అయ్యారు.

హజ్రత్ ఉమర్ (రజి)కు దుఃఖం కల్గింది. కుమార్తె తన పెనుమిటిని కోల్పోయింది కదా అని చింతించారు. కాని ప్రియప్రవక్త (సఅసం) ఆమెను వివాహమాడుతానని కబురు పంపారు. ఈ కబురు హజ్రత్ ఉమర్ (రజి)ను సంతోషపరిచింది. తన మనస్సులోని కోరిక నెరవేరినట్లయింది. అదే సంవత్సరం అంటే హిజ్రి శకం 3వ యేట హజ్రత్ హఫ్సా (రజి) వివాహం ప్రియప్రవక్త (సఅసం)తో అయింది. ఆమె ఉమ్మహాతుల్ మోమినాత్ (విశ్వాసుల మాతృమూర్తిగా) పరిగణించబడ్డారు.

## ప్రథమ వక్ఫ్

హి[జ్రీశకం 7వ సంవత్సరం ఖైబర్‌లో యూదులు ముస్లింల మధ్య ఘోరయుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో హ[జత్ ఉమర్ (రజి) కూడా పాల్గొని అనన్య ధైర్యసాహసాలతో పోరాడారు. యూదులు కూడ తమ శక్తియుక్తులు ఉపయోగించి పోరాడారు. కాని ముస్లింల ధాటికి నిలువలేకపోయారు. చివరికి వారు పరాజితులయి కాళ్ళబేరానికి వచ్చారు. యుద్ధం ముగిసింది. ఖైబరు ముస్లింల కైవశం అయింది.

ప్రియప్రవక్త (సఅసం) జయించిన ఖైబరు భూములను యుద్ధవీరులకు పంచిపెట్టారు. హ[జత్ ఉమర్ (రజి)కు కూడా ఆ భూమిలో ఒక భాగం వచ్చింది. ఆ భూభాగం పేరు సమగ్. కాని హజరత్ ఉమర్ (రజి) ఆ భూమిని దైవమార్గంలో దానం చేశారు. దాని ఆదాయం ధర్మవ్యాప్తి కోసం వ్యయం చేయాలని చెప్పారు.

హ[జత్ ఉమర్ (రజి) దూరదృష్టితో స్థాపించిన ఈ వక్ఫ్ మొట్టమొదటి ధర్మాదాయ స్థిరాస్తి అయింది.

## ఉపన్యాస ప్రభావం

రోజులు గడుస్తున్నాయి. చివరికి ప్రియప్రవక్త (సఅసం) ఈ ప్రపంచాన్ని శాశ్వతంగా వీడిపోయారు. పిడుగులాంటి ఈ వార్త వినగానే హ[జత్ ఉమర్ (రజి) తన మనోసమతూలనం కోల్పోయి కోపో[ద్రేకాలతో చిందులు తొక్కడం ప్రారంభించారు. నబవీ మసీదుకు వెళ్ళి ఎవరైన ప్రియప్రవక్త (సఅసం) ప్రపంచం వీడిపోయారని అంటే నేనతణ్ణి నరకివేస్తాను అని ప్రకటించారు. అప్పుడు హ[జత్ అబూబకర్ (రజి) సమయస్ఫూర్తితో వ్యవహరించి నచ్చజెప్పడం వల్ల హ[జత్ ఉమర్ (రజి) శాంతించారు. ఆ తరువాత ఆయన అబూబకర్ (రజి) వెంట 'సఖీఫా బనీసా అదహ్' వైపు వెళ్ళిపోయారు.

షైతాను పన్నాగంతో అక్కడ ఒక సమస్య ఉత్పన్నమైంది. ప్రియప్రవక్త (సఅసం) తదనంతరం ఆయన ప్రతినిధి (ఖలీఫా)గా అన్సారీల మనిషి ఉండాలా లేక ముహాజర్ల మనిషి ఉండాలా అన్నదే ఆ సమస్య. పరిస్థితులు

విషమిస్తున్నాయి. వివాదం తీవ్రరూపం దాల్చుతోంది. అంతలో ఈ ఇరువురు మహాశయులు అక్కడికి చేరుకొని నచ్చజెప్పడంతో వివాదం సద్దుమణిగింది. హజ్రత్ ఉమర్ (రజి) ఒక గంభీరోపన్యాసం చేశారు. ఆ ఉపన్యాసం వినగానే ప్రజల ఆవేశం చల్లారిపోయింది. వెంటనే ఆయన హజ్రత్ అబూబకర్ (రజి)ను ఖలీఫాగా అమోదిస్తూ 'బయితు' (ప్రమాణం) చేశారు. ఆ తరువాత ప్రజలు కూడా హజ్రత్ అబూబకర్ (రజి)ను ఖలీఫాగా అంగీకరిస్తూ 'బయితు' చేశారు. ఉమర్ (రజి) ఉపన్యాసంలో మంత్రశక్తి ఉందంటే అతిశయోక్తికాదు.

## ఆయన ఖలీఫా అయ్యారు

హజ్రత్ అబూబకర్ (రజి) రెండేళ్ళ మూణ్ణల్లు మాత్రమే ఖలీఫాగా ఉన్నారు. అబూబకర్ (రజి) పాలనాకాలంలో సాధించిన ఘనకార్యాలన్నింటిలో హజ్రత్ ఉమర్ (రజి) ఆయనకు సలహాలు ఇచ్చారు. హజ్రత్ అబూబకర్ (రజి) కూడ ఏ కొత్త పనయినా హజ్రత్ ఉమర్ (రజి) సలహా తీసుకోకుండా చేపట్టేవారుకాదు. ఈ విధంగా ఉమర్ (రజి) తెలివితేటలు, శక్తిసామర్థ్యాలను గమనించిన హజ్రత్ అబూబకర్ (రజి)కు తన తదనంతరం ఆయన ఖలీఫా కావాలనే ఆకాంక్ష కలిగింది.

హజరత్ అబూబకర్(రజి) వ్యాధి గ్రస్తులయ్యారు. పరిస్థితులు క్షీణిస్తూ వచ్చాయి. అబూబకర్ (రజి) కొందరు మేధావులతో సంప్రదించి తన తదనంతరం హజ్రత్ ఉమర్ (రజి)ను ఖలీఫాగ నిర్ణయించారు. ఆయన స్వభావంలో మృదుత్వం కలిగించమని అల్లాహ్‌ను వేడుకొన్నారు కూడ.

ఆ తరువాత కొన్నాళ్ళకు హిజ్రీశకం 13వ యేట, జమాదివుస్సాని నెల, 23వ తేదీన అంటే క్రీ.శ. 634, ఆగస్టు 24వ తేదీ సోమవారం రోజు హజ్రత్ అబూబకర్ (రజి) దివంగతులయ్యారు. (ఇన్నాలిల్లాహి వ ఇన్నాఇలైహి రాజివూన్). అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) ఖలీఫా అయ్యారు.

ఆయన ఖలీఫాబాధ్యతలు చేపట్టిన తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) తలపెట్టిన ప్రణాళికలపై దృష్టి సారించి వాటిని అమలుపరచడానికి పూనుకొన్నారు.

## ఈరాన్‌పై దాడి

హజ్రత్ అబూబకర్ (రజి) కాలంలోనే ఈరాన్, ఇరాక్, సిరియా దేశాలపై దాడులు ప్రారంభమయ్యాయి. ముస్లింలు విజయ పరంపరలతో ముందుకు పురోగమిస్తున్నారు. ఎన్నో పట్టణాలు స్వాధీనమయ్యాయి. హజ్రత్ ఉమర్ (రజి) ఈ యుద్ధాలను కొనసాగించారు. ఈరాన్‌పై దండెత్తిన ముస్లిం సైన్యానికి హజ్రత్ ముస్నా బిన్ హారిస (రజి) సేనాధిపతిగ ఉన్నారు. ఆయన జసర్ యుద్ధంలో క్షతగాత్రులయ్యారు. చివరికి అ గాయంతోనే ఆయన పరమపదించారు. ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్. ఆయన స్థానంలో హజ్రత్ ఉమర్(రజి) హజ్రత్ సాఅద్ ఇబ్నె వఖ్ఖాస్ (రజి)ను సైన్యాధిపతిగ నియమించారు. ఈయన 'సహబా'లోని ప్రముఖులలో ఒకరు. ప్రియప్రవక్త (సఅసం)కు మామ కూడా అవుతారు. సేనాపతిగా నియుక్తులయ్యాక ఖాదిసియా వైపు పంపబడ్డారు. 'ఖాదిసియా' ఈరాన్ ముఖద్వారంగ పరిగణించబడేది. ఖాదిసియా జయించారంటే ఈరాన్ దేశం వశమైనట్లే.

అందువల్ల ఈరాన్ చక్రవర్తి యజ్దగిర్ద్ తన సైన్యంలో పేరు మోసిన అధికారి రుస్తుమ్‌ను సైన్యాధిపతిగ నియమించాడు. ఒక లక్ష ఇరువది వేల మంది సైన్యాన్ని ముస్లింలతో పోరాడడానికి పంపాడు. ఈ సమాచారం హజ్రత్ ఉమర్ (రజి)కు తెలియగానే ముస్లిం సైన్యాధిపతికి ఒక సలహా ఇచ్చారు. యుద్ధం ప్రారంభంకాక ముందు ఒక ప్రతినిధి బృందాన్ని ఇరాన్ చక్రవర్తి వద్దకు పంపి సంధి సంప్రదింపులు చేయమన్నారు. అందుకు ఒప్పుకోకపోతే యుద్ధం చేయమన్నారు.

## గంపెడు మన్ను

హజ్రత్ ఉమర్ (రజి) ఇచ్చిన సలహా మేరకు సాఅద్ ఇబ్నె అబీ వఖ్ఖాస్ (రజి) నలుగురి సభ్యులతో కూడిన ఒక బృందాన్ని ఈరాన్ చక్రవర్తి వద్దకు పంపారు. ఆ బృందంలో నోమాన్ ఇబ్నె మఖ్రన్ (రజి), మ అన్న ఇబ్నె హారిస (రజి), ముగైర ఇబ్నె షఅబ (రజి), ఆసిమ్ ఇబ్నె అమ్ర్ (రజి) ఉన్నారు. ఈ బృందం మదాయన్ చేరింది. ఈరాన్ ప్రజలు వారి నిరాడంబరత, అరకొర

సామగ్రిని చూసి ఆశ్చర్యపోయారు. "వీరా! మన చక్రవర్తితో యుద్ధానికి వచ్చింది?" అని పరస్పరం చెప్పుకున్నారు.

ఈ బృందాన్ని యజ్దగిర్ద్, ఈరాన్ చక్రవర్తి సమక్షంలో ప్రవేశపెట్టారు. ఆ చక్రవర్తి వారిని అసహ్యంగా చూస్తూ "మీరెందుకు వచ్చారు ఇక్కడికి?" అని అడిగాడు.

ఆ బృందంలోని ఒకరు చక్రవర్తికి మొదట దైవధర్మాన్ని ప్రబోధించారు. ఆ తరువాత "మీరు ఈ ధర్మాన్ని స్వీకరించారంటే మేము మిమ్మల్ని మా సోదరునిగ చేసుకొంటాం. అలా కాదంటే జిజియా చెల్లించి మాతో సంధి చేసుకోండి. దీనికి కూడ అంగీకరించకపోతే మీకు మాకు మధ్య ఖడ్గమే నిర్ణయం చేస్తుంది".

ఇది విన్న యజ్దగర్ద్‌కు పట్టరాని కోపం వచ్చింది. వెంటనే అతను తన భటుల్ని పిలిచి "ఒక గంపెడు మట్టి తెచ్చి ఈ నలుగురిలో గౌరవనీయుడైన వ్యక్తి నెత్తిన పెట్టండి. తరువాత వీరిని మదాయిన్ నుండి బయటికి తీసేయండి" అని ఆజ్ఞాపించాడు. అలాగే చేయబడింది. బృంద సభ్యులు గంపెడు మట్టిని తీసికొని సంతోషిస్తూ ఖాదిసియా చేరుకున్నారు. హజ్రత్ సాఅద్ ఇబ్నె అబి వఖ్ఖాస్ ముందు ఆ గంపెడు మట్టి పెట్టి "మీకు శుభం కలుగుగాక! శత్రువు స్వయంగా తన భూభాగాన్ని మనకు స్వాధీనం చేశాడు" అని చెప్పారు.

ఈ మాట విని ముస్లిం యోధులు ఎంతో సంతోషించారు. ఈ సంగతి ఈరాన్ సైన్యాధిపతికి కూడా తెలిసింది. అతను దానిని అపశకునంగా భావించాడు. పైగా ఈరాన్ చక్రవర్తిని దూషించాడు కూడ.

## రుస్తుం చంపబడ్డాడు

ముస్లింల విజయవార్తలు విని రుస్తుం లోలోన తీవ్రంగా ఆందోళన చెందసాగాడు. ఈరాన్ చక్రవర్తి అతడ్ని ముస్లింలతో యుద్ధం చేయమని బలవంతం చేస్తున్నాడు. కాని రుస్తుం ఏవో సాకులు చెబుతూ యుద్ధాన్ని వాయిదా వేస్తున్నాడు. చివరకు గత్యంతరంలేక యుద్ధం చేయవలసి వచ్చింది. ఖాదిసియాలో జరగిన ఈ యుద్ధం మూడు రోజులు సాగింది. రెండు రోజుల

వరకు యుద్ధం ఓ కొలిక్కి రాలేదు. దానికి కారణం ఈరాన్ సైన్యంలో అనేక మదపుటేనుగులను సైనిక పంక్తులకు ముందుంచారు. వాటిని చూసి ముస్లిం యోధుల గుఱ్ఱాలు బెదిరిపోయి పరుగెత్తేవి. చివరికి ముస్లింలు ఆ ఏనుగుల మీదికి బాణాలు వదలి వాటి కళ్ళు పొడవాలని, తరువాత వాటి తొండాలు కోసేస్తే అవి వెనక్కి పరుగులంకించుకుంటాయని నిర్ణయించారు.

మూడవ రోజు అలాగే చేశారు. అన్నిటికంటే ముందు వస్తున్న పెద్ద ఏనుగు పైకి బాణం వదలి దాని కళ్ళు పొడిచారు. ఆ వెనువెంటనే ఒక సైనికుడు ముందుకు లంఘించి దాని తొండాన్ని కోసిపారేశాడు. దాంతో ఆ ఏనుగు చిర్రెత్తిపోయి వెనక్కి తిరిగి పరుగెత్తింది. ఇక చూడండి, అది చూసి గజరాజు వెనకాలే మిగతా ఏనుగులు కూడా ఘీంకరిస్తూ పరుగుపెట్టాయి. మైదానం ఖాళీ అయిపోయింది. ఆ తరువాత వెంటనే ముస్లిం సైనికులు ఈరాన్ సైన్యంపై విరుచుకొని పడ్డారు. ఈరాన్ సైన్యం ముస్లింల ధాటికి తట్టుకోలేక పలాయనం చిత్తగించింది. పాపం సేనాపతి రుస్తుం ప్రాణాలు కాపాడుకోడానికి పరుగు లంకించుకున్నాడు. ఎదురుగా ఒక నది ఉంటే అందులోకి దూకాడు. హిలాల్ అనే ముస్లిం సిపాయి అతణ్ణి గుర్తుపట్టి నదిలో దూకాడు. రుస్తుం కాళ్ళు పట్టుకొని ఈడుస్తూ బయటికి తెచ్చాడు. తరువాత కరవాలంతో అతడ్ని శాశ్వతంగా కడతేర్చాడు. ఈ విధంగ ఖాదిసియను జయించారు ముస్లింలు. ఈ యుద్ధంలో ఈరానీయులకు ఎంతో ప్రాణనష్టం, ధన నష్టం జరిగింది.

## నదీ ప్రవాహంలో గుఱ్ఱాలు పరుగెత్తించారు

ఖాదిసియా విజయానంతరం మదాయిన్ వంతు వచ్చింది. మదాయిన్ ఈరాన్ రాజధాని పట్టణం. ఈరాన్ సైన్యాలు ఇక్కడ గుమికూడడం ప్రారంభించాయి. హజ్రత్ సాఅద్ ఇబ్నె అబి వఖ్ఖాస్(రజి) అధైర్యం చెందలేదు. ఆయన సైన్యాన్ని తీసికొని బహ్రెషేర్ పట్నానికి చేరుకున్నారు. ఇది మదాయిన్ భూభాగం పరిధిలోని పట్టణమే. ఇరుపక్షాల సైన్యాల మధ్య దజ్లా నదీ పరవళ్ళు తొక్కుతోంది. నదికి ఒకవైపు ఒక ముస్లిం సైనికులు, మరోవైపు ఈరాన్ సైనికులు ఉన్నారు. ఇక నది దాటే సమస్య ఎదురయింది. హజ్రత్ సాఅద్ (రజి) తన

సైనికుల వైపు చూసి "మీలో ఎవరైనా ఈ నది దాటగలిగేవారు ఉన్నారా?" అని అడిగారు. ఈ మాట వినగానే ఆసిమ్ బిన్ ఉమర్ (రజి) తన అరవై మంది అనుచరులతో ముందుకు వచ్చారు. అల్లాహ్ పేరు స్మరించి గుఱ్ఱాల మీద నదిలోకి దిగారు. వారి వెనుక హజ్రత్ ఖఅఖా బిన్ అమ్ర్ (రజి), ఆయన అధీనంలో ఉన్న ఆరువందల మంది సైనికులు కూడా తమ తమ గుఱ్ఱాలతో పాటు నదిలో దిగారు. ఈ గుఱ్ఱాలన్నీ నీటిగుఱ్ఱాల మాదిరిగా ఈదుకుంటూ అతివేగంగా ఆవలి ఒడ్డుకు చేరసాగాయి. ఈ అపూర్వ దృశ్యాన్ని చూసి ఈరాన్ సైనికులు ఆశ్చర్యచకితులయ్యారు. ఆవలి ఒడ్డుకు చేరిన ఇస్లామీయ సైన్యాన్ని చూసి ఈరానీయుల్లు తీవ్రమైన భయాందోళనలతో 'దేవాన్ ఆమద్ నద్, దేవాన్ ఆమద్ నద్' (దేవతలు వచ్చారు, దేవతలు వచ్చారంటూ) కేకలు పెడ్తూ పరుగెత్తారు. మదాయిన్ ఖాళీ అయింది. మదాయిన్ కోటలోని వారు జిజియా చెల్లించడానికి ఒప్పుకొన్నారు. ఈ విధంగ యుద్ధం జరగకుండానే మదాయిన్ ముస్లింల కైవశమయింది. యుద్ధ సొత్తు ముస్లింల చేతికి వచ్చింది. వాటిని సైనికులకు పంచడం జరిగింది. అందులో ఐదవ భాగం మదీనలోని సర్కారు ఖజానకు పంపబడింది.

## నిహావంద్ యుద్ధం

ఈరాన్ సైనికులు నిహావంద్ కోటలో సమాయత్తమౌతున్నారని హజ్రత్ ఉమర్ (రజి)కు తెలిసింది. వెంటనే ఆయన ఒక్క నిముషం కూడ వృధా చేయకుండ ముప్ఫయి వేల మంది సైనికులను అక్కడికి పంపారు. ఈ సైన్యానికి సేనాపతిగా నోమాన్ బిన్ ముఖ్రాన్ (రజి) నియమించబడ్డారు. నిహావంద్‌కు తొమ్మిది మైళ్ళ దూరంలో అస్వద్ హాన్ అనే ప్రదేశంలో సైన్యం విడిది చేసింది. ఇరానియన్లు యుద్ధ మైదానంలో సూదుల్లాంటి మొనదేలిన వస్తువులు పరిచారు. వాటివల్ల ముస్లింలు ముందుకు వెళ్ళడం కష్టమయిపోయింది. వెంటనే వారు తమ యుద్ధ వ్యూహాన్ని మార్చుకొన్నారు. నిహావంద్‌కు ఆరు మైళ్ళదూరంలో కొండగుట్టలు ఉన్నాయి. వాటి వెనుక తమ సైన్యాన్ని దాచారు. ఖఅఖా బిన్ అమ్ర్‌కు ఒక సైనికదళం ఇచ్చి నిహావంద్ కోటపై దాడిచేయమని చెప్పి పంపారు. యుద్ధం ప్రారంభం కాగానే

వ్యూహం ప్రకారం ఖఅఖా తన సైన్యాన్ని వెనుకకు తీసికొంటూ వచ్చారు. ఇది చూసి ఈరానీయన్ల మనోబలం పెరిగింది. చిన్న దళంగా ఉన్న ముస్లిం సైన్యాన్ని హతమార్చేందుకు కోటలోని ఈరాన్ సైన్యం కోట వదలి బయటకు వచ్చింది. ఖఅఖా సైన్యం ప్రాణాలను రక్షించుకొంటు వెనుకకు జరుగుతూ గుట్టల చాటున అత్యధిక సంఖ్యలో దాగిఉన్న తమ సైనిక పటాలం దగ్గరికి వచ్చింది. అదను చూచి నోమాన్ తన యావత్తు సైన్యంతో ఈరాన్ సైన్యంపై విరుచుకు పడ్డారు. అకస్మాత్తుగ పైబడిన ముస్లిం సైన్యాన్ని చూచి ఈరాన్ సైన్యం కంగారుపడుతూ చిందరవందర అయింది. ముస్లింసైనికులు ఈరానీయన్లను బెండకాయలను కోసినట్లు హతమార్చడం మొదలెట్టారు. యుద్ధభూమిలో గుఱ్ఱాలు జారిపడేటంతగా రక్తం యేరులై పారింది. చివరికి ఈ రక్తపు మడుగుల్లో సేనాపతి నోమాన్ ఎక్కిన గుఱ్ఱం కూడ జారి పడిపోయింది. నోమాన్ తీవ్రంగా గాయపడి అమరగతినొందారు. ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.

ఈరానీయన్లు కాస్సేపటికే యుద్ధరంగం నుండి పలాయనం చిత్తగించారు. ముస్లింలు వారిని చాలదూరం వరకు వెంటాడారు. నిహావంద్ ముస్లింల వశమయిపోయింది. ఈ యుద్ధంలో ముప్ఫయివేల మంది ఈరానీయన్లు ప్రాణాలు కోల్పోయారు.

## ఈరాన్ సామ్రాజ్య పతనం

నిహావంద్ చేజారిన తరువాత ఈరానియన్ల నడుము విరిగి పోయింది. వారి బలం శాశ్వతంగ నశించింది. వారి చక్రవర్తి యజ్దగిర్ద్ దేశం వదలి పారిపోయాడు. దేశబహిష్కరణ జీవితం అనుభవిస్తూ చివరికి ఇహలోకం వీడిపోయాడు. నిహావంద్ జయాన్ని ముస్లింలు 'ఫతహుల్ ఫతూహ్' అని అన్నారు; అంటే మహావిజయం అని అర్థం. ఈ విధంగ యావత్తు ఈరాన్ ఇస్లామీయరాజ్య పరిధిలోకి వచ్చింది.

ఈ విజయవార్త తెలియగానే హజ్రత్ ఉమర్ (రజి) ముస్లింలందరిని నబవీ మసీదులో సమావేశపరచి వారికీ శుభవార్త తెలియజేశారు. తరువాత ఆయన శ్రోతలను ఉద్రూతలూగించే ప్రసంగం కూడ చేశారు. ఆయన ఉపన్యాసం ఈ క్రింది వాక్యాలతో అంతం అయింది.

"ఈరోజు ఈరాన్ సామ్రాజ్యం పతనమయింది. వారు ఇక ముస్లింలను నష్టపరచలేరు. కాని జ్ఞాపకముంచుకోండి. మీరు రుజుమార్గంపై నడవడం మానేస్తే, దైవం మీ నుండి రాజ్యం లాక్కొని ఇతరులకిస్తాడు." ఈ సంఘటన హిజ్రీశకం 21వ సంవత్సరంలో, అంటే క్రీ.శ. 642లో జరిగింది.

## డెమాస్కస్‌ను వశపరచుకొన్నారు

ఇరాక్‌తో పాటు సిరియాలో కూడా యుద్ధాలు కొనసాగుతున్నాయి. హజ్రత్ ఉమర్ (రజి) ఖలీఫా అయినప్పుడు ముస్లిం సేనలు డెమాస్కస్ కోటను చుట్టుముట్టి ఉన్నారు. డెమాస్కస్‌కు వెళ్ళేదారులన్ని మూసేశారు. దారులు మూసేయడం వల్ల డెమాస్కస్ ప్రజలు అల్లాడిపోయారు. అదే సమయంలో ముస్లింలకు అదృశ్య సహాయంగా ఒక సంఘటన జరిగింది. డెమాస్కస్‌లో ఒక గొప్ప క్రైస్తవ మతగురువు ఉండేవాడు. ఆయనకు ఒక కుమారుడు కలిగాడు. ఆ సందర్భంగ ఆయన నగరంలో బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశాడు. ఈ విందులో ప్రజలు అమితంగ మద్యపానం సేవించారు. సాయంత్రానికల్లా ప్రజలు, సైనికులు అందరూ బాగా అలసిపోయి నిద్రకు ఉపక్రమించారు. నగరంలో పూర్తిగా సద్దుమణిగింది. ఈ సంగతి ముస్లిం సేనాపతి హజ్రత్ ఖాలిద్ (రజి)కు తెలిసింది. వెంటనే ఆయన కొంత మంది సాహసవీరులను వెంట తీసికొని కోట దగ్గరికి చేరుకున్నారు. బయట ఉన్న కందకం నీటితో నిండి ఉంది. హజ్రత్ ఖాలిద్ (రజి), ఆయన అనుచరులు నీటిసంచులు ఉపయోగించి కందకం దాటారు. తరువాత తాటి నిచ్చెనల ద్వారా కోటగోడలెక్కి లోపలికి దిగి నగర ముఖద్వారం తెరిచారు. ఈ విధంగా ముస్లిం సేనలు హఠాత్తుగా నగరంలో ప్రవేశించడం చూసి నగర ప్రజలు బెంబేలెత్తిపోయారు. తమకు ప్రాణబిక్ష పెట్టమని మనవిచేసుకున్నారు. హజ్రత్ ఖాలిద్ (రజి) వారికి శరణు ఇచ్చారు. వారిపట్ల సద్వర్తనతో ప్రవర్తించారు. క్రైస్తవులు ముస్లింల నైతిక ప్రవర్తనకు ఎంతో ప్రభావితులయ్యారు. ఈ సంఘటన హిజ్రీశకం 14వ సంవత్సరంలో జరిగింది.

## హజ్రత్ ఖాలిద్ (రజి)కు ఉద్వాసన

హజ్రత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) ఒక సుప్రసిద్ధ వ్యక్తి. ప్రియప్రవక్త (సఅసం) అనుచరులలో అగ్రగాములు. ఆయన గొప్ప పరాక్రమశాలి,

సాహసవీరుడు. రణరంగంలో దిగితే చాలు, శత్రువుల గుండెల్లో గుబ్బాలు పరుగెడుతాయి. చూస్తుండగనే యుద్ధం తీరు మారిపోతుంది. ప్రత్యర్థులు ఆయన ఎదుటకు రావడానికి జంకేవారు. ఆయన ఏ యుద్ధంలో పాల్గొన్నా ముస్లింలకు తప్పకుండా విజయం చేకూరుతుందని ప్రజలు భావించేవారు. రణరంగంలో ఆయన కృషి అంతా పేరుప్రతిష్ఠల కోసమో లేదా ప్రాపంచిక ప్రయోజనాల కోసమే మాత్రం కాదు. కేవలం అల్లాహ్ ప్రసన్నత కోసం ఆయన తన ప్రాణాన్ని కూడ లెక్కచేయకుండ యుద్ధంలో పాల్గొనేవారు. అందుకోసమే ప్రియప్రవక్త (సఅసం) ఆయనకు సైఫుల్లాహ్ (దేవుని కరవాలం) అనే బిరుదు ప్రసాదించారు.

హజ్రత్ అబూబకర్ (రజి) ఖలీఫాగ ఉన్న కాలంలో హజ్రత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) సైన్యాధిపతిగ ప్రదర్శించిన యుద్ధ చాతుర్యం అద్భుతమైంది. ఈ కారణంగానే కొంతమంది ప్రజలు ముస్లింలకు చేకూరిన విజయాలన్నీ ఖాలిద్ బిన్ వలీద్ (రజి)మూలంగానే చేకూరాయని, ఆయన లేకపోతే ఇన్ని విజయాలు లభించవేమోనని భావించసాగారు. ప్రజల ఆలోచనా ధోరణి హజ్రత్ ఉమర్ (రజి)ను కలవరపరుస్తుండేది. ఇది షైతాను ఎత్తుగడగా భావించేవారు ఆయన. జయాపజయాలు అల్లాహ్ అధీనంలో ఉన్నాయి. ఆయన తాను తలచుకున్న విధంగా కొందరికి గౌరవం ప్రసాదిస్తాడు. మరికొందరిని అవమానం పాల్జేస్తాడు. కాకపోతే కృషి చేయడం మానవ ధర్మం. అందుకే హజ్రత్ ఉమర్ (రజి) ఖలీఫా కాగానే ఈ విషయంపై దృష్టి సారించారు. పరిస్థితులు అదుపులోకి వచ్చిన తరువాత ఆయన హజ్రత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి)ను సైన్యాధిపతి పదవి నుంచి తొలగించారు. ఈ ఆజ్ఞ ఖాలిద్ బిన్ వలీద్ (రజి)కు రణరంగంలో ఉండగా అందింది. హజ్రత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) ఎలాంటి తటపటాయింపుకు లోనుకాకుండా వెంటనే ఖలీఫా ఆజ్ఞను శిరసావహించి పదవి నుండి తప్పుకున్నారు. ఆయన స్థానంలో హజ్రత్ అబూ ఉబైదా(రజి) సైన్యాధిపతిగ నియమించబడ్డారు. హజ్రత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) కొత్త సేనాధిపతికి విధేయుడై ఒక సామాన్య సైనికునిగ సేవలు అందజేయడం ప్రారంభించారు.

ఒక సారి హజ్రత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి)తో ఒకతను మాట్లాడుతో "సైన్యాధిపతి పదవి నుండి మిమ్మల్ని తొలగించి సాధారణ సిపాయిగ మార్చినప్పుడు, మీ అనుభవం ఏమిటీ?" అని అడిగాడు. దానికి హజ్ర త్ ఖాలిద్ (రజి) ఎంతో ప్రశాంతవదనంతో "నేను సైన్యాధిపతిగ ఉన్నప్పుడు కేవలం అల్లాహ్ కోసం యుద్ధం చేశాను, సాధారణ సైనికునిగ ఉన్నప్పుడు కూడ అల్లాహ్ ప్రీతి పొందడానికే యుద్ధం చేశాను. నా దృష్టిలో ఈ రెండిటిలో వ్యత్యాసం లేదు" అని సమాధానమిచ్చారు.

ఎవరైతే అల్లాహ్ సంతోషాన్ని పొందడానికి ఏదైన పని చేస్తారో వారు సర్వావస్థల్లో సంతోషంగ ఉంటారు- ప్రపంచంలో పేరు ప్రతిష్ఠలు ఉన్నా లేకున్నా వారు వాటిని ఖాతరు చెయ్యరు.

## బైతుల్ మఖ్దిస్ కైవశం

డెమాస్కస్‌ను కైవశం చేసికొన్న పిమ్మట ముస్లిం సైన్యాలు ముందుకు పురోగమిస్తూ జోర్డాన్, హమస్, యర్మూక్, అంతాకియ మరియు నోబుల్స్‌ను వశపరచు కొన్నాయి. చివరకు బైతుల్ మఖ్దిస్ చేరుకొని హిజ్రీశకం 16లో దాన్ని దిగ్బంధం చేశాయి. అక్కడి క్రైస్తవులు కొన్ని రోజులదాకా ఆత్మరక్షణ కోసం ప్రయత్నిస్తూ చివరకి గత్యంతరంలేక ఒక షరతుపై సంధికి సిద్ధమయ్యారు. అమీరుల్ మోమినీన్ స్వయంగ వచ్చి సంధి పత్రంపై సంతకం చేయమన్నారు.

ఈ సంగతి హజ్రత్ ఉమర్ (రజి)కు తెలియజేయబడింది. హజ్రత్ ఉమర్ (రజి) తన ముఖ్య అనుచరులతో సంప్రదించిన తరువాత రాజధాని నగరం మదీనాలో హజ్రత్ అలి (రజి)ను తన ప్రతినిధిగ నియమించి బైతుల్ మఖ్దిస్‌కు ప్రయాణమయ్యారు. తానొక మామూలు సిపాయిగ ప్రయాణం చేశారు. జాబియా అనే ప్రదేశంలో అక్కడి అధికారులందరు ఆయనకు స్వాగతం పలికారు. ఆయన అతుకులు వేసిన చొక్కా ధరించి ఉన్నారు. ఆయన కూర్చొన్న గుఱ్ఱం గిట్టెలు అరిగిపోవడం వల్ల కుంటుతూ నడుస్తోంది. మేలు జాతి గుర్రాన్ని, మంచి దుస్తుల్ని సమర్పించినప్పుడు దుస్తులు, సామానుల వల్ల గౌరవం లభించదని చెప్పి వాటిని త్రోసిపుచ్చారు. "దైవం మాకు ఇస్లాం ద్వారా ఇచ్చిన గౌరవమే చాలు మాకు" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి).

## బైతుల్ మఖ్‌దిస్‌లో ప్రవేశం

హజ్రత్ ఉమర్ (రజి) సాదా దుస్తులతోనే బైతుల్ మఖ్‌దిస్‌లో ప్రవేశించారు. అక్కడున్న ప్రజలు అమీరుల్ మోమినీన్ ఎవరయ్యా అని ఒకరినొకరు దర్యాప్తు చేసుకొంటున్నారు. వీరేనండి అమీరుల్ మోమినీన్ అని తెలియపరచినప్పుడు వారు ఆశ్చర్యపోయేవారు. ఆయనలో, సాధారణ సిపాయిలో ఏ మాత్రం వ్యత్యాసం వారికి కనబడలేదు. మొదట హజ్రత్ ఉమర్ (రజి) మసీదులో ప్రవేశించారు. హజ్రత్ దావూద్ (అలై) పేరుతో ఉన్న దావూద్ మెహరాబ్ వద్దకు వెళ్ళి సజ్దా దావూద్ ఆయతును దివ్యఖుర్‌ఆన్ నుండి పఠిస్తూ సజ్దా చేశారు. ఆ తరువాత క్రైస్తవుల చర్చీను చూశారు. నమాజు సమయం వచ్చింది. అక్కడ చర్చిలో నమాజు చేసుకొమ్మని క్రైస్తవులు అనుమతించారు. కాని ఈ విషయంలో జాగ్రత్త వహించాలి, లేకుంటే తరువాత చిక్కులు వచ్చిపడతాయి అని అక్కడ నమాజు చేయలేదు. బయటకు వచ్చి నమాజు చేశారు.

హజ్రత్ ఉమర్ (రజి) అక్కడ అనేక రోజులు బస చేశారు. ఒక రోజు హజ్రత్ బిలాల్(రజి)ను పిలిచి అజాన్ ఇవ్వమని చెప్పారు. "మహాప్రవక్త (సఅసం) పరమపదించిన తరువాత నేను ఎవరు చెప్పిన అజాన్ ఇవ్వనని నిర్ణయించుకొన్నాను. కాని ఈ దినం మీ ఆజ్ఞను శిరసావహిస్తాను" అని అన్నారు హజ్రత్ బిలాల్ (రజి). ఆయన అజాన్ ప్రారంభించారు. ప్రియప్రవక్త (సఅసం) 'సహబ' కన్నీరు కారుస్తూ ఏడ్వసాగారు. ఒకసారి అందరు ప్రియప్రవక్త (సఅసం) ఉద్యమకాలాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నారు. హజ్రత్ ఉమర్ (రజి) ఏడుస్తుంటే ఎక్కిళ్ళు కూడా వచ్చాయి.

## ఈజిప్టును జయించడం

హజ్రత్ అమర్ ఇబ్నుల్ ఆస్ (రజి) ఈజిప్టు విషయంలో పరిజ్ఞానం కలవారు. హజ్రత్ ఉమర్ (రజి) అనుమతి పొంది ఈజిప్టుపై దండెత్తారు. నాలుగు వేల సైనికులు ఆయన వెంట ఉన్నారు. ఎన్నో పట్టణాలను కైవశం చేసు కుంటూ ఫస్‌తాత్ కోటను ముట్టడించారు. కాని తన సైన్యం తక్కువగ ఉండడం

చూసి, అదనపు బలగాలు కావాలంటూ హజ్రత్ ఉమర్ (రజి)కు లేఖ వ్రాసి పంపారు. వెంటనే హజ్రత్ ఉమర్ (రజి) నలుగురు సైన్యాధికారుల తోపాటు పదివేల సైన్యాన్ని పంపారు. అందులో హజ్రత్ జుబేర్ ఇబ్నుల్ అవామ్ ఒకరు.

ఏడు మాసాలు పోరాటం చేయవలసివచ్చింది. హజ్రత్ జుబేర్ (రజి) చూపిన అసాధారణ ప్రతిభ వల్ల ఫస్తాత్‌ను ముస్లిం సేనలు కైవశం చేసుకోగలిగారు. అక్కడ నుండి సేనలు సికింద్రియా వైపు పురోగమించాయి. కొన్ని రోజులు ఆ పట్టణాన్ని ముట్టడించి దానిని కూడా స్వాధీనం చేసుకొన్నారు. ఈ విజయపరంపరలు వింటూ హజ్రత్ ఉమర్ (రజి) అల్లాహ్‌కు సజ్దా చేశారు, కృతజ్ఞతలు తెలుపుకొన్నారు.

సికింద్రియాను జయించిన తరువాత ఈజిప్టులో ఇస్లాం ఢంకా మారుమ్రోగింది. ఈ రాజ్యాలను హిజ్రీ శకం 20, 21 సంవత్సరాల మధ్య జయించగలిగారు.

## నైలునదికిచ్చే వధువు

పూర్వకాలంలో ఈజిప్టు వాసులు (ఖబ్తీలు) నైలు నదిని దేవతగ తలంచేవారు. ప్రతి సంవత్సరం ఒక ప్రత్యేక నెల పన్నెండవ తేదీన ఒక కన్యను వధువుగ చేసి నైలునదిలో పడేసేవారు. ఇలా ప్రతి సంవత్సరం ఒక కన్యను బలివ్వకపోతే నైలు నది ఆగ్రహించి నీటిని ఇవ్వడం మానేస్తుందని వారి నమ్మకం.

ఈజిప్టు ముస్లింల అధీనంలోకి వచ్చింది. అప్పుడా ప్రత్యేక నెల రాగానే ఈజిప్టు వాసులు (ఖబ్తీలు) హజ్రత్ అమరిబ్నుల్ ఆస్ (రజి) దగ్గరికొచ్చి నైలు నదికి కన్యను బలివ్వడానికి అనుమతించమని అభ్యర్థించారు. హజ్రత్ అమర్ ఇబ్నుల్ ఆస్ (రజి) వారికి నచ్చజెబుతూ, ఇవన్నీ వట్టిమాటలని, ఈ విధంగ ఒక మనిషి ప్రాణాలు తీయడం ఇస్లాం అనుమతించదని చెప్పారు. ఈమాట విని ఖబ్తీలు వాపసు వెళ్ళిపోయారు.

కాని యాదృచ్ఛికంగా ఆ సంవత్సరం నైలు నది ఎండిపోయింది. నీరు రాలేదు. దాంతో ఆ యేడు పొలాలు ఎండిపోయాయి. ఖబ్తీలు బాధపడ్డారు. వచ్చిన క్షామం వారిని పీడించడం వల్ల వారు స్వదేశం వదలి వెళ్తున్నారు. హజ్రత్

ఇబ్నుల్ ఆస్ (రజి) జరిగినదంత హ్రజత్ ఉమర్ (రజి)కు తెలియజేశారు. ఆయన ఇలా జవాబిచ్చారు: 'మీరు ఖబ్తీలతో నిజం పలికారు. నేనొక ఉత్తరం పంపుతున్నాను. మీరు దానిని నైలు నదిలో పడేయండి." ఆ ఉత్తరంలో ఇలా వ్రాసి ఉంది:

అల్లాహ్ దాసుడు అమీరుల్ మోమినీన్ నైలు నదికి వ్రాయడం. ఓ నైలునదీ! నీ ఇష్టప్రకారం ప్రవహిస్తుంటే ప్రవహించడం మానెయ్యవచ్చు. అలాకాకుండ అల్లాహ్ పట్ల విధేయత కలిగి ఆయన ఆజ్ఞ ప్రకారం ప్రవహిస్తుంటే వెంటనే ప్రవహించడం ప్రారంభించు."

ఉత్తరం నైలు నదిలో వేయడమయింది. దైవాజ్ఞ వల్ల మళ్ళీ నైలు నది ప్రవహించడం ప్రారంభమయింది. మునుపెప్పుడులేని విధంగ అందులో నీళ్ళు వచ్చాయి. ఆ పిమ్మట నైలు నది మరెప్పుడు ఎండిపోలేదు.

## హత్యా దాడి

నిహావంద్ యుద్ధంలో ఒక ఖైదీని పట్టుకొన్నారు. అతని పేరు ఫేరోజ్. అతణ్ణి మొగైర బిన్ షోఅబ (రజి) బానిసగా చేసుకొన్నారు. అతని కునియత్ అబూ లూలూ. ఒక రోజు అతను హ్రజత్ ఉమర్ (రజి) దగ్గరకు వచ్చి తన యజమాని తనపై మోయలేని భారంగ తనపై పన్ను విధించాడని ఫిర్యాదు చేశాడు. హ్రజత్ ఉమర్ (రజి) "ఎంత పన్ను విధించాడ"ని అడిగారు. ఆ బానిస "రోజుకు రెండు దిర్హములు" అని చెప్పాడు. మళ్ళీ హ్రజత్ ఉమర్ "నీవు చేసే వృత్తి ఏమిటి?" అని అడిగారు. "వడ్రంగం, కమ్మరి, చిత్రలేఖనం పనులు చేస్తాను" అని చెప్పాడు ఫేరోజ్. అప్పుడు హ్రజత్ ఉమర్(రజి) "ఈ పనులకు ఈ పన్ను ఎక్కువేమీ కాదు" అన్నారు. దాంతో ఫేరోజ్ అసంతృప్తితో గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు. ఆరోజు నుంచి అతను హ్రజత్ ఉమర్ (రజి)కు శత్రువయ్యాడు. అవకాశం కోసం ఎదురుచూడసాగాడు. ఒక రోజు హ్రజత్ ఉమర్ (రజి) ఉదయం నమాజు చేయించడానికి ముందుకు వచ్చారు. ఫేరోజ్ అవకాశం చూసి కత్తితో ఆరు పోట్లు పొడిచాడు. హ్రజత్ ఉమర్ (రజి) అక్కడికక్కడే కుప్పకూలారు. ఆ నమాజ్‌ని హ్రజత్ అబ్దుర్ రహ్మాన్ బిన్ అవుఫ్ (రజి) చేయించారు.

నమాజుకు వచ్చినవారు ఫేరోజ్‌ను పట్టుకోవడానికి ప్రయత్నించారు. కాని అతడు అనేకమందిని గాయపరుస్తూ చివరకు అదే కత్తితో పొడుచుకొని చచ్చాడు. ఈ సంఘటన హిజ్రీశకం 22వ సంవత్సరం, జిల్‌హజ్ నెల 26వ తేదీన అంటే క్రీ.శ. 644లో జరిగింది.

## చివరి కోరిక

హజ్రత్ ఉమర్ (రజి)ను ఎత్తుకొని ఇంటికి తెచ్చారు. ఆయన మొట్టమొదట "నా హంతకుడెవరు?" అని అడిగారు. 'ఫేరోజ్' అని తెలుపబడింది. ఇది విన్న తరువాత హజ్రత్ ఉమర్ (రజి) సంతృప్తితో "అల్‌హమ్దులిల్లాహ్! నా హంతకుడు ముస్లిం మాత్రం కాదు" అన్నారు.

గాయాలు తీవ్రంగ ఉన్నాయి. ఇక జీవించడం అసాధ్యమని ఆయనకు అర్థమయింది. తనయుడు అబ్దుల్లాహ్(రజి)ను పిలిచి, ఆయెషా (రజి) దగ్గరకు వెళ్ళి తన భౌతికకాయాన్ని ప్రియప్రవక్త (సఅసం) సమాధి ప్రక్కనే ఖననం చేయవలసిందిగా ఉమర్ విన్నవించుకుంటున్నాడని చెప్పు అని అన్నారు.

హజ్రత్ అబ్దుల్లాహ్ (రజి) వెళ్ళారు. హజ్రత్ ఆయెషా (రజి) దుఃఖిస్తున్నారు. ఆయన హజ్రత్ ఉమర్ (రజి) తరఫున సలాం చెప్పి విషయం తెలియజేశారు. దానికి హజ్రత్ ఆయెషా (రజి) సమాధానమిస్తూ "ఆ స్థలం నేను నా కోసం ప్రత్యేకించుకున్నాను. కాని ఇప్పుడు ఉమర్ (రజి) అభ్యర్థనను కాదనలేను. నేనాయనకు ప్రాధాన్యత ఇస్తున్నాను" అని అన్నారు. ఈ అనుమతి హజ్రత్ ఉమర్ (రజి)కు తెలుపబడింది. అప్పుడాయన "ఇదే నా చివరి పెద్ద కోరిక. అల్ హమ్దులిల్లాహ్. దేవుని దయ వల్ల అది ఈరోజు నెరవేరింది" అన్నారు అప్రయత్నంగా.

## ఆయన వీలునామ

ఆ సమయంలో ఆయన తరువాత ఖలీఫా ఎవరు అనే సమస్య వచ్చిపడింది. 'సహబ' ఈ ఎన్నికను మీరే చేసి వెళ్ళండని మాటిమాటికి చెప్పసాగారు. చివరకు హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు: "నేను బాగా

ఆలోచించాను. కాని ఈ బాధ్యతాభారాన్ని మోయగలిగే వారెవరూ నాకు కన్పించడం లేదు. అయితే నేను ఆర్గురు వ్యక్తులను సూచిస్తున్నాను. వారిలో ఎవరి పట్ల ఎక్కువ అభిప్రాయం వస్తుందో అతడ్ని ఖలీఫాగ ఎన్నుకోండి. (వారి పేర్లు) అలి (రజి), ఉస్మాన్ (రజి), జుబేర్ (రజి), తల్హా(రజి), సాఅద్ బిన్ అబివఖ్ఖాస్ (రజి), అబ్దుర్ రహ్మాన్ బిన్ అవుఫ్ (రజి)." ఆ తరువాత అన్నారు: ఖలీఫాగా ఎన్నుకోబడిన వ్యక్తి ఐదు వర్గాలవారి హక్కుల్ని పూర్తిగ నెరవేర్చే విషయం దృష్టిలో పెట్టుకోవాలని నేను కోరుతున్నాను. 1. ముహాజిర్లు, 2. అన్సారులు, 3. పల్లెవాసులు, 4. ఇతర పట్టణాలకెళ్ళి స్థిరపడిన అరబ్బులు, 5. జిమ్మీలు."

ఆ తరువాత ఆయన తన కుమారుడు హజ్రత్ అబ్దుల్లాహ్(రజి)ను పిలిచి "నేను తీర్చవలసిన అప్పు ఎంతుంది?" అని అడిగారు. ఎనభై ఆరువేల దిర్హములని తెలుపబడింది. "అయితే నా ఇంటిని అమ్మి ఆ అప్పు తీర్చు" అన్నారు ఆయన. కొందరు ఈ మాట విని "ఈ రుణం మీరు ప్రజల సహాయార్థం తీసికొన్నారు కదా, దీనిని బైతుల్ మాల్ (ప్రభుత్వ ధనాగారం) నుండి చెల్లించవచ్చు కదా?" అని అన్నారు. కాని ఆయన అందుకు ఇష్టపడలేదు. ఆ రుణాన్ని చెల్లించమని తన కుమారునకు తాకీదు చేశారు.

## ఆయన ప్రపంచాన్ని వీడారు

మూడు రోజులు గాయాలతో బాధపడి హి.శ. 24వ సంవత్సరం, మొహరం నెల ఒకటో తేదీ (644 క్రీ.శ.) శనివారం రోజున ప్రపంచాన్ని వదలి వెళ్ళారు హజ్రత్ ఉమర్ (రజి). ఇన్నాలిల్లాహి వ ఇన్నాఇలైహి రాజివూన్.

ఆయన జనాజ నమాజును హజరత్ సుహేబ్(రజి) చేయించారు. ప్రియప్రవక్త (సఅసం) సమాధికి ఎడమవైపు ఆయన్ను ఖననం చేశారు. ఆయన వయస్సు దాదాపు 63 సంవత్సరాలు. ఆయన్ను గోరిలో పూడ్చకముందే హజ్రత్ అబ్దుల్లాహ్ (రజి) ఇంటిని అమ్మి రుణాన్ని పూర్తిగ తీర్చారు. ఈ ఇంటిని హజ్రత్ మావియ (రజి) కొన్నారు.

హజ్రత్ ఉమర్ (రజి) మృతిపట్ల యావత్తు అరబ్బులు సంతాపం ప్రకటించారు. హజరత్ ఇమాం హుసైన్ (రజి) అన్నారు: "ఏ కుటుంబం ఉమర్

(రజి)లేని వెల్తిని గ్రహించదో అది చెడ్డ కుటుంబం." హజరత్ ఉమర్ (రజి) ఖిలాఫత్ పాలనను 10 సంవత్సరాల 6 నెలల 4 రోజులు సాగించారు.

## హజ్రత్ ఉమర్ (రజి) సతీమణులు

హ్రజత్ ఉమర్ (రజి) తన జీవితంలో అనేకమంది స్త్రీలను వివాహ మాడారు. ఆయన భార్యల పేర్లు:

**1. హ్రజత్ జైనబ్ బిన్తె మజ్ఊన్ (రజి):** ఈమె హ్రజత్ ఉస్మాన్ ఇబ్నె మజ్ఊన్ గారి చెల్లెలు. మక్కాలోనే ఇస్లాం స్వీకరించారు. అక్కడే పరమపదించారు. ఆమె ఖురైష్ వంశస్థురాలు.

**2. మలికా బిన్తె జరోల్:** ఈమె ఖుజాఅ తెగకు చెందినవారు. ఈమెను ఉమ్మె కుల్సూమ్ అని కూడ అంటారు. ఈమె ఇస్లాం స్వీకరించలేదు. అందువల్ల హ్రజత్ ఉమర్ (రజి) ఈమెకు విడాకులిచ్చారు.

**3. ఖరీబ బిన్తె అబీ ఉమయ్యా మఖ్జూమి:** ఖురైష్ వంశానికి చెందినవారు. ఈమె విశ్వాసుల మాతృమూర్తి హ్రజత్ ఉమ్మె సల్మా (రజి) గారి చెల్లెలు. ఇస్లాం స్వీకరించక పోవడం వల్ల హి.శ 6వ సంవత్సరం హ్రజత్ ఉమర్ (రజి) ఈమెకు విడాకులిచ్చారు. వీరికి సంతానం లేదు.

**4. ఉమ్మె హకీం బిన్తె హారిస్ బిన్ హిషామ్ మఖ్జూమి:** హ్రజత్ ఉమర్ (రజి) ఈమెకు కూడా విడాకులిచ్చారని కొందరు అంటారు. మరికొందరు లేదంటారు. ఈమె జీవితాన్ని గురించి వివరాలు తెలియవు.

**5. హ్రజత్ జమీలా బిన్తె ఆసిమ్ బిన్ సాబిత్ (రజి):** ముస్లింకాక మునుపు ఈమె పేరు ఆసియా. ఇస్లాం స్వీకరించాక ప్రియప్రవక్త(సఅసం) ఈమె పేరును మార్చి 'జమిలా' అని పెట్టారు. ఏదో కారణంతో ఈమెకు కూడ హ్రజత్ ఉమర్ (రజి) విడాకులిచ్చారు.

**6. హజరత్ ఆతిక బిన్తె జైద్ (రజి):** ఈమె హ్రజత్ ఉమర్(రజి)గారి చిన్నాయన కూతురు. ఈమె మొదటి భర్త హ్రజత్ అబ్దుల్లాహ్ బిన్ అబూబకర్

(రజి) తాయిఫ్ యుద్ధంలో మరణించడం వల్ల హజ్రత్ ఉమర్ (రజి) హి.శ. 12వ సంవత్సరం ఈమెను వివాహమాడారు.

**7. హజ్రత్ ఉమ్మె కుల్సూమ్ బిన్తె హజ్రత్ అలి (రజి):** ఈమె హజ్రత్ ఫాతిమ (రజి) కూతురు. హజ్రత్ ఉమర్(రజి)కు ప్రియప్రవక్త (సఅసం) కుటుంబంతో కూడా బంధుత్వం కలిగిఉండాలనే కోరిక కల్గింది. అందువల్ల ఆయన హజ్రత్ అలి (రజి)కు ఎంతో నచ్చజెప్పి హి.శ. 17వ సంవత్సం హజ్రత్ ఉమ్మె కుల్సూమ్ (రజి)ని వివాహమాడారు. వీరేకాకుండా ఇద్దరు బానిసలను కూడా ఆయన వివాహమాడారు. వారిలో ఒకరి పేరు ఫకియా యమనియా, మరొకరి పేరు లహత్తియా.

## సంతానం

హజ్రత్ ఉమర్ (రజి)కు చాలా మంది సంతానం కలిగారు. వారి పేర్లు, సంక్షిప్త విశేషాలు ఇక్కడ పేర్కొంటున్నాము:

**1. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి):** ఈయన హజ్రత్ జైనబ్ బిన్తె మజ్‌ఊన్ ద్వారా కలిగారు. హదీసు, 'ఫిఖ' శాస్త్రాల్లో విశిష్ఠ పాండిత్యం కలవారు. మక్కాలో ఉండగానే ముస్లిం అయ్యారు. ప్రియప్రవక్త (సఅసం)లో కలసి అనేక యుద్ధాలలో పాల్గొన్నారు. ఎంతో సాహసవంతులు. ఎప్పుడూ సత్యం పలికేవారు. 84సంవత్సరాల వయస్సులో హి.శ. 74వ సంవత్సరంలో చనిపోయారు.

**2. హజ్రత్ హఫ్‌సా బిన్తె ఉమర్ (రజి):** ఈమె కూడ హజ్రత్ ఉమర్ మొదటి భార్య ద్వారానే జన్మించారు. ఈమె వివాహం ప్రియప్రవక్త (సఅసం)తో అయింది. ఈమె అనేక హదీసులను ఉల్లేఖించారు. హి.శ. 45వ సంవత్సరం 63 ఏండ్ల ప్రాయంలో ప్రపంచం వదలివెళ్ళారు.

**3. హజరత్ అబ్దురహ్మాన్ అక్బర్ బిన్ ఉమర్ (రజి):** ఈయన కూడ హజ్రత్ జైనబ్ (రజి) ద్వారానే జన్మించారు. జీవిత విశేషాలు తెలియవు.

**4. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి):** ఈయన మలిక బిన్తె జరోల్

ద్వారా కలిగారు. ధైర్యసాహసాలు గల వ్యక్తి. మల్లయుద్ధంలో ఆయనకు సమానులు ఎవరూలేరు.

**5. హజ్రత్ ఫాతిమ బిన్తె ఉమర్ (రజి):** ఈమె ఉమ్మె హకీ ద్వారా కలిగిన సంతానం. ఈమె జీవిత విశేషాలు కూడా తెలియవు.

**6. హజ్రత్ ఆసిమ్ బిన్ ఉమర్ (రజి):** ఈయన హజ్రత్ జమీల ద్వారా కలిగారు. ఎంతో ధర్మాత్ముడు, సద్గుణశీలుడు, గొప్ప పండితుడు. తండ్రిలాగే భారీకాయం కలవారు. సచ్ఛీలం, పరిపాలనా దక్షతల కారణంగా రెండవ ఉమర్‌గా ప్రసిద్ధిచెందిన హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) గారి మనమడు ఈయన. హజ్రత్ ఆసిమ్ హి.శ. 70వ సంవత్సంలో చనిపోయారు.

**(7) హజ్రత్ అయాజ్ బిన్ ఉమర్ (రజి):** జీవిత విశేషాలు తెలియవు. హజ్రత్ ఆతిక బిన్తె జైద్ ద్వారా కలిగిన సంతానం.

**(8) హజ్రత్ జైద్ బిన్ ఉమర్ (రజి), (9) హజ్రత్ రుఖియా బిన్తె ఉమర్ (రజి)** : వీరిరువురు హజ్రత్ కుల్సూమ్ బిన్త్ అలి (రజి) ద్వారా కలిగిన సంతానం. జీవిత విశేషాలు తెలియవు.

**(10) హజ్రత్ అబ్దుర్రహ్మాన్ ఔసత్ బిన్‌ఉమర్ (రజి), (11) హజ్రత్ జైనబ్ బిన్తె ఉమర్ (రజి)** :వీరిద్దరు ఫకియ యమ్నియా ద్వారా జన్మించారు.

**12. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఉమర్ (రజి):** లహత్తియ అనే బానిస ద్వారా కలిగిన సంతానం.

**(13) హజ్రత్ అబూషహ్మా బిన్ ఉమర్ (రజి), (14) హజ్రత్ మజీర్ బిన్ ఉమర్ (రజి):** వీరిద్దరు కూడా హజ్రత్ ఉమర్ (రజి) గారి కుమారులే. కాని జీవిత విశేషాలు తెలియవు.

## హజ్రత్ ఉమర్ (రజి) ఎలాంటివారు?

హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) దేహం దృఢంగా ఉండేది. చెంపల మీద కండలు తక్కువ. ముఖం గంభీరంగా ఉండేది, తల పెద్దగ ఉండేది. గోధుమ రంగు వర్ణం. ముంగురులు చెదిరి ఉండేవి. గడ్డం గుబురుగా ఉండేది,

మీసాలు పెద్దవి. వందలాది జనంలో కూడ ఇట్టే గుర్తించబడగలిగేటంత పొడుగ్గా ఉండేవారు ఆయన. గొప్ప పర్యాక్రమశాలి. ఎంతో ధైర్యసాహసాలు కలవారు. స్వభావంలో కాఠిన్యం ఉండేది. అయితే ఖలీఫా అయ్యాక ఆయనలో కాఠిన్యం తగ్గిపోయి మృదుత్వం వచ్చింది. కాని ధార్మిక వ్యవహారాలలో మాత్రం కఠినంగానే ఉండేవారు. అందువల్లనే ప్రియప్రవక్త (సఅసం) తరచుగా "షైతాన్ ఉమర్ (రజి)నీడను చూసినా భయపడి పరుగెత్తేవాడు" అని చెప్పేవారు. అతి సాధరణమైన దుస్తులు ధరించేవారు. ఆ దుస్తులలో అతుకులుండేవి. తలకు పాగా కట్టేవారు. అరబ్బులు ధరించే సాధారణ చెప్పులే వేసుకొనేవారు.

అన్నపానీయాలు అతి సాధారణమైనవి. రొట్టె మీద జైతూన్ నూనె రాసి తినేవారు. అప్పుడప్పుడు మాంసం, పాలు, కూరగాయలు మరియు సిర్కా కూడా తీసుకునేవారు. నిరాడంబరమైన స్వభావం కలవారు. ఎలాంటి మొహమాటం లేకుండా మాట్లాడేవారు. ప్రియప్రవక్త (సఅసం) అంటే అమిత ప్రేమ. అల్లాహ్ అయిష్టత అంటే ఎంతో భయపడేవారు. ఏకాంతంలో అల్లాహ్‌ను క్షమించమని వేడుకుంటూ కన్నీరుకార్చేవారు. అందరి పట్ల సమానంగ మెలిగేవారు. న్యాయశీలురు. ఆయన జీవితం రాత్రులలో దైవారాధనలో, పగలు ప్రజాసేవలో గడిపేవారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన సకలవిధాల సద్గుణసంపన్నులు. అందుకే అల్లాహ్ ఆయన పట్ల ప్రసన్నుడయ్యాడు.

## పరలోక విచారణ అంటే భయం

అల్లాహ్ విధించే శిక్ష అన్నా, పరలోకంలో జరిగే కర్మవిచారణ అన్నా హజ్రత్ ఉమర్ (రజి) ఎంతో భయపడేవారు. ఒకసారి దారిన నడుస్తూ నేల మీదున్న ఒక చిన్న పుడక తీసుకొని "నేను (పరలోక విచారణకు లోనుకాని) ఇలాంటి పుడకలా అయి ఉంటే ఎంత బాగుండేది! లేదా నేనసలు పుట్టకుండా ఉంటే ఎంత బాగుండేది!" అన్నారు.

"ఒకవేళ ఆ శరీరవాణి ఒక వ్యక్తి తప్ప అందరు స్వర్గీయులే అని పలికినట్లయితే అప్పటికి నరకం చేరే ఆ దురదృష్టవంతుడు నేనౌతానేమో అన్న భయం నాకుండేది." అన్నారు ఆయన మరో సందర్భంలో.

అల్లాహ్‌ను సంతోషపెట్టడానికి రేయింబవళ్ళు అల్లాహ్‌కు నచ్చే పనులు చేసేవారు. పైపెచ్చు ఇలా అనేవారు: "పరలోక విచారణ దినాన నేను చేసిన పుణ్యకార్యాలు పాపకార్యాలతో సరితూగినట్లయితే చాలు." చూశారా! కర్మవిచారణ, మరియు అల్లాహ్ అయిష్టత అంటే ఎంత భయమో హజరత్ ఉమర్ (రజి)కి. అల్లాహ్ ఆయనను రక్షించుగాక! ఆమిన్.

## ప్రియప్రవక్త (సఅసం) పట్ల ప్రీతి

ప్రియప్రవక్త (సఅసం) పట్ల ప్రేమ కలిగి ఉండడం విశ్వాసంలో ఒక భాగం. ఎవరి హృదయాలలో ప్రియప్రవక్త (సఅసం) ప్రేమ ఉండదో అవి ముస్లిం హృదయాలుకావు.

ఒకప్పటి విషయం. హజరత్ ఉమర్ (రజి) ప్రియప్రవక్త (సఅసం) సమక్షంలో హాజరయి ఇలా విన్నవించుకొన్నారు: "నా ప్రాణం తప్ప ప్రియప్రవక్త (సఅసం) నాకు యావత్తు ప్రపంచం కంటే ప్రియమైనవారు." ప్రియప్రవక్త (సఅసం) అప్పుడిలాన్నారు: "ఉమర్ (రజి)! నా పట్ల ప్రేమ నీ ప్రాణం కంటే కూడా ఎక్కువగ ఉండాలి." అప్పుడు హ్రజత్ ఉమర్ (రజి) ఒక్కక్షణం ఆలోచించి "ఇప్పుడు నేను ప్రియప్రవక్త (సఅసం)ను నా ప్రాణం కంటే కూడా అధికంగ ప్రేమిస్తున్నాను" అని అన్నారు. ఇది కేవలం ఆయన నోటి మాట కాదు ఆయన దాన్ని ఆచరించి నిరూపించిన వాస్తవం కూడా.

ప్రియప్రవక్త (సఅసం) తన జీవితకాలంలో ఎవరినైతే ఆత్మీయులుగ చూసుకొనేవారో, అట్టివారిని హ్రజత్ ఉమర్ (రజి) తాను ఖలీఫాగ ఉన్నప్పుడు కంటికి రెప్పలా చూసుకున్నారు. 'సహబ'కు పించన్లు నిర్ణయించారు. జైద్ బిన్ హారిస (రజి)ను ప్రియప్రవక్త (సఅసం) ఎంతో అభిమానించేవారు. అందువల్ల హ్రజత్ ఉమర్ (రజి) ఆయన కుమారుడు హజరత్ ఉసామ బిన్ జైద్ (రజి)కు తన కుమారుని కంటే అధికంగ పించను నిర్ణయించారు. హజరత్ అబ్దుల్లాహ్ (రజి) ఈ వివక్ష పట్ల అభ్యంతరం తెలిపారు. దానికి హజరత్ ఉమర్ (రజి) "కుమారా! ప్రియప్రవక్త (సఅసం) ఉసామా (రజి)ను నీకంటే అధికంగ ప్రేమించేవారు. (అందువల్లనే ఆయనకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాను).

ప్రియప్రవక్త (సఅసం) పట్ల తనకున్న ప్రేమను ఆచరణాత్మకంగ నిరూపించు కొనేవారు హజరత్ ఉమర్ (రజి).

## ప్రియప్రవక్త (సఅసం) పట్ల విధేయత

ప్రియప్రవక్త (సఅసం)కు విధేయులయి ఆయన్ని అనుసరించడం విశ్వాసంలో ఉండవలసిన తప్పనిసరి అంశం. ఈ విషయంలోను ప్రియప్రవక్త (సఅసం) ఆదర్శాన్ని పాటించకపోతే మనం నిజమైన విశ్వాసులం కాలేము. ఈ దృక్పథంతో చూచినట్లయితే హజరత్ ఉమర్ (రజి) అందరికంటే అధికంగ ప్రియప్రవక్త (సఅసం) ఆదర్శాన్ని పాటించేవారు. మనం ఆలోచించలేని తీరులో హజరత్ ఉమర్ (రజి) ప్రియప్రవక్త (సఅసం)ను అనుసరిస్తూ వచ్చేవారు.

ఒకప్పుడు ప్రియప్రవక్త (సఅసం) జబిల్ హులిఫా అనే స్థలంలో రెండు రకాతులు నమాజు చేశారు. హజరత్ ఉమర్ (రజి) ఆ ప్రాంతం మీదుగా ఎప్పుడు వెళ్ళినా అక్కడ రెండు రకాతులు నమాజు తప్పకుండ చేసేవారు. ఒకాయన అడిగాడు: "ఈ నమాజు దేనికోసం?" "ప్రియప్రవక్త (సఅసం) ఇక్కడ నమాజు చేయడం చూశాను. అంచేత నేను కూడా ఇక్కడ నమాజు చేస్తున్నానని" జవాబిచ్చారు హజరత్ ఉమర్ (రజి).

ఒకరోజు హజర్-యె-అస్వద్ దగ్గరకు వెళ్ళారు హజరత్ ఉమర్ (రజి). మొదట ఆ నల్లరాయిని ముద్దాడి తరువాత ఇలా అన్నారు: "ఓ అస్వద్! నీవొక రాయి మాత్రమేనని నాకు తెలుసు. లాభనష్టాలు కల్గించే శక్తి నీలో లేదు. ప్రియప్రవక్త (సఅసం) నిన్ను ముద్దాడకపోయి ఉండినట్లయితే నేను ఎన్నటికి నిన్ను ముద్దాడేవాణ్ణి కాను."

చూశారా! ప్రియప్రవక్త (సఅసం) ఏ పనిని ఏ విధంగ చేయడం చూశారో అదే విధంగ చేయడానికి ప్రయత్నించేవారు హజరత్ ఉమర్ (రజి).

## జాగ్రత్త వహించడం

ప్రభుత్వధనాగారంలోని ఏ వస్తువునైనా అనుమతి లేకుండా తీసుకోవడం సరికాదని హజరత్ ఉమర్ (రజి) తలచేవారు. తన దృష్టికి ఇలాంటి విషయం ఏదైనా వచ్చిందంటే వెంటనే దానిని నిరోధించేవారు ఆయన.

ఒకనాటి విషయం. హజరత్ ఉమర్ (రజి) బజారులో నడుస్తున్నారు. ఒక బలిసిన ఒంటె అమ్మబడుతుంటే చూసి ఆ ఒంటె ఎవరిదని అడిగారు. అది ఆయన కుమారుడు అబ్దుల్లాహ్‌ది అని తెలిసింది. హజరత్ అబ్దుల్లాహ్‌ను ఉమర్ (రజి) అడిగారు: "ఈ ఒంటె ఎక్కడుండేద"ని.

తనయుడు వినయంగ ఇలా చెప్పాడు: "నేను ఆ ఒంటెను కొని సర్కారు పచ్చికబయలులో వదిలాను. అక్కడది బాగ మేసి బలిసింది. ఇప్పుడు నేను దీన్ని అమ్మదలిచాను." ఇది విన్న హజరత్ ఉమర్ (రజి) అన్నారు: "ఈ ఒంటె సర్కారు పచ్చికబయలులో తిని బలిసింది కనుక, నీవు దీని అసలు ధర మాత్రమే తీసుకోవడానికి హక్కుదారుడవు. మిగిలిన ధనం సర్కారు ఖజానాలో జమ చెయ్యి."

సర్కారు వస్తువులంటే, వాటి ఉపయోగమంటే హజరత్ ఉమర్ (రజి) ఎంత జాగ్రత్తపడేవారో చూశారా!

## సాధు స్వభావం

హజరత్ ఉమర్ (రజి)లో రాజఠీవి ఎంతగా ఉట్టిపడేదంటే ఆయన పేరు వింటేనే ఈరాన్, రోము చక్రవర్తులు కంపించి పోయేవారు. అయితే ప్రజాసేవ విషయంలో ఆయన సాధుస్వభావం కలిగి ఉండేవారు. వంటిమీది చొక్కాకు పన్నెండు అతుకులు ఉండేవి. చినిగిన తలపాగ, తెగిన చెప్పులతో ఎంతో నిరాడంబరంగా ఉండేవారు. భుజంపై నీటికుండ మోసుకొని వితంతువుల ఇండ్లకు తీసికెళ్ళి ఇచ్చేవారు.

ఇస్లామీయ సైన్యంలో చేరి యుద్ధానికి వెళ్ళినవారి ఇండ్లకు పోయి క్షేమసమాచారాలు తెలిసికొనేవారు, బజారుకెళ్ళి సరుకులు తెచ్చిచ్చేవారు. పని చేసిచేసి బాగా అలసిపోయినప్పుడు నబవీ మసీదుకెళ్ళి వట్టినేల మీద ఓ మూల పడుకొనేవారు.

ఎంత నిరాడంబరమైన జీవితం ఆ మహనీయునిది!

అల్లాహ్ ఆయనకు పరలోకంలో ఉన్నతమైన హోదాలు ప్రసాదించుగాక!

## ఉన్నదాంతోనే తృప్తి

ప్రలోభం అంటే అసలు గిట్టదు హజరత్ ఉమర్ (రజి)కు. ఉన్న దానితో తృప్తి చెందడం ఆయన స్వభావం. ఒకసారి ప్రియప్రవక్త (సఅసం) హజరత్ ఉమర్ (రజి)కు ఏదో ఇవ్వదలిచారు. అప్పుడు ఉమర్ (రజి) "నాకంటె ఎక్కువ పేదవాళ్ళు ఎందరో ఉన్నారు. వారు దీనికి హక్కుదారులవుతారు" అని అన్నారు: ప్రియప్రవక్త ఈ మాట విని "దీన్ని తీసుకో. ఆ తరువాత నీ ఇష్టం. నీవు స్వయంగా వాడుకోవచ్చు లేదా మరెవరికైనా ఇవ్వచ్చు. మనిషికి అడక్కుండానే ఏదైన దొరికితే దాన్ని స్వీకరించాలి" అని చెప్పారు.

హజరత్ ఉమర్ (రజి) ఖలీఫా అయ్యాక వ్యాపారం వదలుకోవలసి వచ్చింది. ప్రభుత్వధనాగారం నుండి తనకోసం అందరికంటే తక్కువ జీతం నిర్ణయించు కున్నారు. అది కనీసావసరాలకు బొటాబొటిగా మాత్రమే సరిపోయేది. ఆయన అన్నారు: "నాకు, నా భార్యాపిల్లలకు తినడానికి, కట్టుకోవడానికి సరిపడినంత జీతం లభిస్తే చాలు." అందువల్ల ఆయన రోజుకు రెండు దిర్హములు చొప్పున జీతం తీసికొనేవారు. సాలీన రెండు జతల బట్టలు తీసికొనేవారు; ఒక జత చలికాలంలో, మరో జత వేసవి కాలంలో. హజ్ లేదా ఉమరా చేయడానికి వెళ్లితే ఒక ఒంటెను తీసుకొని వెళ్లేవారు.

ఈ విధంగ ఆయన జీవితాంతం గడిపారు. అల్లాహ్ ప్రీతికి ఆయన పాత్రుడగుగాక!

## సమానత్వం

హజరత్ ఉమర్ (రజి) ఇలా అనేవారు: "నేను భోగభాగ్యాలు అనుభవిస్తూ ప్రజలు కష్టాలతో లేమిననుభవిస్తుంటే నన్ను మించిన చెడ్డవాడు మరొకడు ఉండడు." ఇలా కేవలం చెప్పడమే కాదు, దాన్ని ఆచరించి చూపారు కూడా.

హి.శ. 18లో కరువు వచ్చింది. అప్పుడు ఆయన ఎంతో తల్లడిల్లి పోయారు. ప్రజల బాధలు చూడలేకపోయేవారు. అప్పుడు ఆయన విదేశాల నుండి ధాన్యం తెప్పించి ప్రజలలో సరఫరాచేశారు. క్షామం ఉన్నంత కాలం తనకు ఇష్టమైన వస్తువులను తినడం మానేశారు. "దేవుని ఇతర దాసులు

ఆకలితో చస్తుంటే నేను సుఖాలు జుర్రుకోవడమా!" అనేవారు. ఆయన రాత్రింబవళ్ళు కష్టపడి పనిచేస్తుండేవారు. దాని వల్ల ఆయన శరీరం నల్లబడి బాగా కృశించిపోయింది.

ఒకరోజు సాయంత్రం ప్రయాణంలో ఉన్నప్పుడు హ్జరత్ ఉమర్ (రజి) దగ్గరికి బాగా రుచికరమైన మంచి మంచి ఆహారపదార్థాలు తీసుకురాబడ్డాయి. ఆయన వాటిని చూసి "అందరికీ ఇలాంటి ఆహారమే లభించిందా?" అని అడిగారు. దానికి కొందరు "అందరికీ ఇలాంటి ఆహారం ఎలా లభిస్తుందండీ?" అన్నారు. "అయితే "నాక్కూడా ఇలాంటి ఆహారం అవసరం లేదు, తీసుకెళ్ళండి" అంటూ ఆయన దాన్ని వాపసుచేశారు.

## బాధ్యతా స్వభావం

హజరత్ ఉమర్ (రజి) ఖలీఫా అయిన తరువాత ప్రజలకు సౌకర్యాలు కల్పించే విషయం గురించే ఎక్కువగా ఆలోచిస్తుండేవారు. ప్రజల కష్టసుఖాలు తెలుసుకోవడానికి రాత్రుళ్ళలో గస్తీ కూడా తిరిగేవారు.

ఒకరోజు రాత్రి ఆయన గస్తీ తిరుగుతూ మదీనా నగరం నుండి మూడు మైళ్ళ దూరం బయట వెళ్ళిపోయారు. హరార్ అనే గ్రామం చేరారు. అక్కడ ఒక ఇంట్లో నుంచి పిల్లల ఏడ్పులు విన్పిస్తుంటే ఆగారు. చూస్తే ఒక మహిళ ఏదో వండుతోంది. ముగ్గురు పిల్లలు వెక్కివెక్కి ఏడుస్తున్నారు. హ్జరత్ ఉమర్ (రజి) దగ్గరకు వెళ్ళి పిల్లలు ఎందుకు ఏడుస్తున్నారని అడిగారు. దానికామె "పిల్లలు ఆకలితో అల్లాడిపోతున్నారు. నా వద్ద వారికివ్వడానికి ఏమీ లేదు. వారిని ఓదార్చేందుకు ఉత్తకుండను కుంపటిపై పెట్టాను" అని చెప్పింది. ఈమాట వినగానే హజరత్ ఉమర్ (రజి) కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వెంటనే ఆయన మదీన వెళ్ళారు. పిండి, నెయ్యి, ఖర్జూరపండ్లు ఒక బస్తాలో వేసుకొని వీపు మీద పెట్టుకొని బయలుదేరారు. అప్పుడు ఆయన సేవకుడు అస్లం వచ్చి "అమీరుల్ మోమినీన్, ఈ బస్తా నాకివ్వండి, నేను మోసికొని వస్తాను" అని అన్నాడు. దానికి హ్జరత్ ఉమర్ (రజి) "నీవు ప్రళయదినాన నా భారం మోయగలవా?" అని ప్రశ్నించారు. ఆ తరువాత ఆయన ఆ బస్తాను మోసుకెళ్ళి

ఆ మహిళ ఇంటికి చేర్చారు. వంట చేయించి ఆకలిగొన్న పిల్లలకు అన్నం వడ్డించారు. పిల్లలు తృప్తిగా తిని పడుకున్న తరువాత ఆయన వెళ్ళిపోయారు.

మరుసటి రోజు ఆయన ఆ మహిళకు, ఆమె పిల్లలకు పించన్లు నిర్ణయించారు. చూశారా! హజరత్ ఉమర్(రజి) ప్రజాసేవ కోసం ఎంత తపించిపోయేవారో!

## సంఘ సేవ

ఒకరోజు రాత్రివేళ హజ్రత్ ఉమర్ (రజి) యథాప్రకారం గస్తీ తిరుగుతుంటే దూరాన ఒక గుడెసె నుండి ఎవరో మూలుగుతున్న శబ్దం వినవచ్చింది. వెళ్ళి చూస్తే అక్కడ ఒక పల్లెవాసి బయట కూర్చుని ఉన్నాడు. లోపలి నుంచి ఏడుపు విన్పిస్తోంది. హజ్రత్ ఉమర్ (రజి) విషయం ఏమిటని బయట కూర్చున్న వ్యక్తిని అడిగారు. దానికి అతను "నా భార్య ప్రసవవేదన పడుతోంది. నేను పరదేశీయుణ్ణి. ఇక్కడ నాకెవరు తెలిసినవారు లేరు సహాయపడడానికి" అని చెప్పాడు.

ఖలీఫా ఉమర్ (రజి) వెంటనే ఇంటికెళ్ళి సతీమణికి విషయం వివరించారు. "నాతో వచ్చి, ఈ స్వర్ణావకాశాన్ని వాడుకుంటావా?" అని అడిగారు. ఆయన భార్య ఉమ్మె కుల్సూం (రజి) వెంటనే సిద్ధమయ్యారు. ఇరువురు ఆ ఇంటికి వెళ్ళారు. ఉమ్మె కుల్సూం (రజి) లోనకు వెళ్ళారు, హజరత్ ఉమర్ (రజి) ఆ పరదేశి వద్ద కూర్చున్నారు. కొద్ది సేపయ్యాక లోపలి నుండి "అమీరుల్ మోమినీన్! మీ స్నేహితునికి కొడుకు కలిగాడని శుభవార్త తెలుపండి" అని వినబడింది. ఆ గ్రామస్థుడు 'అమీరుల్ మోమినీన్' అనే మాట విని అదిరిపడ్డాడు. బిత్తరచూపులతో చూడసాగాడు. హజరత్ ఉమర్ (రజి) అతనికి ధైర్యం చెబుతూ "ఖలీఫా అంటే సంఘసేవకుడే కదా!" అని అన్నారు.

నిజం. ప్రజల స్థితిగతులు తెలుసుకొని వారి ఇబ్బందులను దూరం చేయడం ఖలీఫా బాధ్యత.

## దైవభీతి పరాయణతకే విలువ

ఒకరోజు రాత్రివేళ హజ్రత్ ఉమర్ (రజి) సేవకుడ్ని తీసుకొని గస్తీ తిరుగుతూ ఒక ఇంటి ముందుకెళ్ళి ఆగారు. ఆ ఇంటిలో నుండి "అమ్మా! పాలలో కొంచెం నీళ్ళు కలుపు" అని ఓ వృద్ధ మహిళ కంఠం విన్పించింది.

దానికి ఆ అమ్మాయి "అమ్మా! నువ్వు వినలేదా? ఎవరూ పాలలో నీళ్ళు కలపరాదని" మన అమీరుల్ మోమినీన్ చాటింపు వేయించారు.

తల్లి కుమార్తెతో "ఈ సమయంలో ఇక్కడ అమీరుల్ మోమినీన్ లేరు, చాటింపు చేసేవాడు కూడా లేడు" అన్నది.

"అమ్మా! భలే దానివిలే! ఇక్కడ అమీరుల్ మోమినీన్ లేకపోవచ్చు. కాని అల్లాహ్ చూస్తున్నాడు కదా!" అన్నది కూతురు.

ఆ అమ్మాయి ఇంకా ఇలా అంది: "ఖలీఫా ముందు ఆయనకు విధేయత చూపి, ఆయన లేనప్పుడు ఆయన ఆజ్ఞలను ధిక్కరించడం మనకు మంచిది కాదమ్మా!ఈపని నావల్ల మాత్రం కాదు." ఆ అమ్మాయి ఇచ్చిన సమాధానం విని హజరత్ ఉమర్ (రజి) ఎంతో సంతోషించారు. సేవకుడు అస్లంతో "ఈ ఇంటికి ఒక గుర్తు పెట్టు" అన్నారు.

మరుసటి రోజు ఒక వ్యక్తిని పంపి తల్లీకూతుళ్ళను పిలిపించారు. అప్పుడు హజరత్ ఉమర్ (రజి), తన కుమారుడు ఆసిమ్ పెళ్ళి ఆ అమ్మాయితో చేయడానికి సంసిద్ధత తెలుపుతూ "ఈ వివాహంలో శుభాలు, శ్రేయాలు కలుగుతాయి" అన్నారు. హజరత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ) ఈ అమ్మాయి మనుమడే!

## అమిత దయాళువు

మరో సందర్భం. ఒకరోజు రాత్రివేళ ఖలీఫా గస్తీ తిరుగుతుంటే ఒక ఇంటిలో నుంచి శిశువు ఏడ్పు విన్పించింది. ఆయన అక్కడ ఠక్కున ఆగి "అల్లాహ్‌కు భయపడు. పిల్లవాణ్ణి ఏడ్పించకు" అన్నారు శిశువు తల్లితో కాస్సేపటికి మళ్ళీ ఏడ్పు వినబడింది. హజ్రత్ ఉమర్ (రజి) మరోసారి ఆమెకు నచ్చచెప్పారు. మూడోసారి ఏడ్పు విన్నాక ఆయనకు కోపం వచ్చి ఇలా అన్నారు: "అల్లాహ్ నిన్ను అర్థం చేసుకోను! నీవెంతటి దయలేని తల్లివి. పిల్లవాడి ఏడ్పు మాన్పించలేవా?" దానికా స్త్రీ సమాధానమిస్తూ " పిల్లవాడు ఆకలి కొన్నాడు. కాని నేను వీడికి పాలు ఇవ్వదలచుకోలేదు" అన్నది. "ఎందుకు?" అని అడిగారు ఖలీఫా. "పాలు త్రాగే పిల్లలకు పించన్లు ఇవ్వరని ఖలీఫా ఆజ్ఞ అయింది.

అంచేత నేనీ పిల్లోడికి పాలు మాన్పించదలిచాను" అన్నది ఆ స్త్రీ. "బాలుని వయస్సెంత?" అని అడిగారు హజ్రత్ ఉమర్ (రజి). ఇంత వయస్సని ఆమె చెప్పింది.

దానికి ఖలీఫా "దైవం నిన్నర్థం చేసికోను! పాలు మాన్పించడంలో తొందరపడకు" అన్నారు. మరునాడు ఉదయం నమాజు తరువాత ఆయన ప్రజలను సమావేశపరిచి ఈ ఉదంతం తెలియజేశారు. "ఉమర్ పాడుగాను! ఎంతమంది పిల్లల పాపం నీకు చుట్టుకుందో! ఈరోజు నుండి పిల్లవాడు పుట్టగానే అతని పేరిట పించన్ మంజూరు అవుతుంది.. ఇకనుంచి తల్లులు తమ పిల్లలకు పాలు మాన్పించడంలో తొందరపడకూడదు" అని అన్నారు.

ఎంత దయాళువో ఆయన మీరే ఆలోచించండి.

## ప్రళయ దినభీతి

ఒకరోజు హజ్రత్ ఉమర్ (రజి) గస్తీ తిరుగుతుంటే దారిలో ఒక వృద్ధురాలు ఎదురయింది. "అమ్మా! మీ అమీరుల్ మోమినీన్ ఎలాంటివాడు?" అని అడిగారు ఆయన ఆమెను. దానికామె "అబ్బాయ్! అతను చాలా చెడ్డవాడు. ఖలీఫా అయిన దగ్గర్నుంచి ఒక్క పైసా కూడా నాకు దొరకలేదు" అన్నది.

హజ్రత్ ఉమర్ (రజి) సమాధానమిస్తూ "ఉమర్‌కు నీ స్థితిగతులు ఏం తెలుసు, నీవు ఎప్పుడైనా పోయి విన్నవించుకున్నావా?" అన్నారు. దానికా ముసలమ్మ మండిపడుతూ "అతను తూర్పు నుంచి పడమర దాకా అన్ని ప్రాంతాల పరిస్థితులు తెలుసుకుంటూ ఉండాలి" అన్నది.

హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని కన్నీరు కారుస్తూ "ఉమర్‌ని చూస్తుంటే నాకు జాలి వేస్తోంది. సరే, నీకు జరిగిన అన్యాయానికి ఎంత మూల్యం తీసుకుంటావు నీవు?" అని అడిగారు. "బాబూ! నన్ను ఆట పట్టించకు" అన్నది ఆ ముసలమ్మ. అంతలో హజ్రత్ అలి (రజి), హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) వచ్చి "అస్సలాము అలైకుం అమీరుల్ మోమినీన్!" అన్నారు.

వృద్ధురాలు అమీరుల్ మోమినీన్ అనే మాట వినగానే బిత్తరపోయి, తాను ఈయన్ని ముహం మీదే చెడ్డవాడన్నానే! అని తలచి కంపించిపోయింది. హజ్రత్ ఉమర్ (రజి) ఆమె పరిస్థితి గమనించి పర్వాలేదన్నారు. తరువాత ఆయన, "ఈ వృద్ధురాలికి చేసిన అన్యాయానికి ఇరవై అయిదు వరహాలు మూల్యం చెల్లించి ఆమె చేత తప్పు మాఫీ చేయించుకున్నాడు. ఇక ఆమె ప్రళయందాకా దేవుని సన్నిధిలో ఫిర్యాదు చేయజాలదు" అని ఒక తోలు మీద వ్రాయించారు. దానికి హజ్రత్ అలి (రజి)ని, హజ్రత్ మస్వూద్ (రజి)ని సాక్షులుగా కూడా పెట్టుకున్నారు ఆయన.

## వాగ్దాన పాలన

షోస్తర్ ముస్లింల కైవశమయిన తరువాత ఈరాన్ పాలకుడు హర్మజాన్‌ని ఖైదీగా పట్టుకొని మదీన పంపించారు ముస్లింలు. ఇతడు పెద్ద మోసగాడు. ఇతని వల్ల ముస్లిం సేనలకు చాలా నష్టం జరిగింది. అందువల్ల అతణ్ణి చంపాలని నిర్ణయించారు హజరత్ ఉమర్ (రజి). చంపడానికి వధ్యస్థలానికి తీసికెళ్ళినప్పుడు అతను త్రాగడానికి నీరు కావాలన్నాడు. ఒక గ్లాసు నీళ్లు ఇవ్వబడ్డాయి. చేతిలో గ్లాసు తీసికొని ఏదో ఆలోచిస్తున్నాడు. నీళ్ళెందుకు త్రాగడం లేదని అడిగితే, "నేను నీరు త్రాగే లోగానే మీరు నాకు శిరచ్ఛేదం చేస్తారేమోనని నాకు భయంగా ఉంది" అన్నాడతను.

హజరత్ ఉమర్ (రజి) వాగ్దానం చేస్తూ "నీవు నీరు త్రాగనంతవరకు నిన్ను హతమార్చము, నీళ్ళు త్రాగు" అని చెప్పారు. ఈమాట వినగానే హర్మజాన్ నీటిని నేల మీద పారబోసి "ఇప్పుడు నేను ఈ నీరు త్రాగనంతవరకు మీరు నన్ను చంపలేరు. ఈ నీరు ఇక నాకు దొరకదు కూడా" అన్నాడు. హజరత్ ఉమర్ (రజి) అతడి కుయుక్తి చూసి ఆశ్చర్యపోయారు. కాని చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవడానికి హజరత్ ఉమర్ (రజి) అతణ్ణి వదలివేశారు.

హజరత్ ఉమర్ (రజి) ప్రవర్తనతో హర్మజాన్ ఎంతో ప్రభావితుడై వెంటనే ఇస్లాం స్వీకరించి ముస్లిం అయ్యాడు. హజరత్ ఉమర్ (రజి) ఆయనకు సాలీనా రెండు వేల దిర్హముల పించన్ మంజూరు చేశారు. హర్మజాన్ తన శేషజీవితాన్ని

మదీనాలోనే గడిపాడు. నిజాయితీ ఏనాటికైనా తన ప్రభావాన్ని చూపుతుంది కదా!

## న్యాయమంటే ఇలా ఉండాలి

ఇరాక్‌లో ఒక పట్టణం ఉంది. దాని పేరు జందేసాపూర్. ఆ పట్టణంపై ముస్లింలు దాడిచేసినప్పుడు పట్టణప్రజలు కోట తలుపులు మూసేశారు. ముస్లింలు కోటను ముట్టడించారు. ఇరుపక్షాల మధ్య పోరు మొదలైంది. కొన్నాళ్ళ తరువాత కోట ద్వారాలు తెరువబడ్డాయి. పట్టణ ప్రజలు నిశ్చింతగ అటుఇటు తిరగసాగారు. ఇది చూసి ముస్లింలు విస్మయం చెందారు. ఏమిటి విషయం అని విచారిస్తే పట్టణవాసులు విషయం తెలియజేస్తూ "మీరు మాకు రక్షణ ఇచ్చాక కూడ మేము నిశ్చింతగ తిరగరాదా?" అన్నారు.

ఈ జవాబు విని ముస్లింలు మరింత ఆశ్చర్యపోయారు. ఎవరయ్యా! వీరికి రక్షణ ఇచ్చారు అని ఆలోచించారు. చివరకు ఒక బానిస యోధుడు జిజియా షరతుపై వారికి రక్షణ ఒప్పందం వ్రాసిచ్చాడని తెలిసింది. దీనిపై ముస్లింలలో పరస్పరం భేదాభిప్రాయాలు కలిగాయి. కొంతమంది "ఈ ఒప్పందం రహస్యంగ జరిగింది గనక దీనికి మనం కట్టుబడి ఉండనవసరం లేద"ని అన్నారు. సైన్యాధిపతి ఈ సమస్య పరిష్కారం కోసం హజరత్ ఉమర్ (రజి) దగ్గరకు పంపారు. ఆయన బానిస యోధుడు ఇచ్చిన రక్షణను ఆమోదించారు. "ఒక వ్యక్తి చేసిన వాగ్దానం మొత్తం ముస్లిం సముదాయం తరఫున చేసిన ఒప్పందం అవుతుంది" అని చెప్పి పంపారు హజరత్ ఉమర్ (రజి).

చూశారా! ఆయన న్యాయశీలత ఎలాంటిదో! న్యాయమంటే ఇలా ఉండాలి.

## సర్కారు ఖజాన ఒక ట్రస్టు

హజరత్ ఉమర్ (రజి) బైతుల్‌మాల్ (సర్కారు ఖజాన)లోని ప్రతి వస్తువును అమానతు (భద్రంగా కాపాడమని అప్పగించిన సొమ్ము)గా భావించేవారు. ఆ సొమ్ముకు తనను ట్రస్టీగా తలచేవారు. ఒకరోజు అహ్నఫ్ బిన్ ఖైస్ కొంతమంది సర్దారులతో కలసి హజరత్ ఉమర్ (రజి)ని కలుసు

కోడానికి వచ్చారు. అప్పుడు హ్రజత్ ఉమర్ (రజి) చొక్కా చేతులు పైకి మడిచి కంగారుపడుతూ అటూఇటూ తిరుగుతున్నారు. అహ్నఫ్‌ను చూసి "రండి! మీరు కూడా కాస్త నాతో సహకరించండి. బైతుల్‌మాల్‌కు చెందిన ఒక ఒంటె తప్పించుకొనిపోయింది. దాన్ని వెతుకుదాం రండి" అన్నారు.

అహ్నఫ్ ఈమాట విని "ఈ పని ఒక సేవకుడు కూడ చేస్తాడు కదా! మీరెందుకు కంగారుపడుతున్నారు?" అని అన్నారు.

"అహ్నఫ్! రేపు పరలోక తీర్పుదినాన ఈ విషయంలో లెక్క చెప్పు కోవాల్సింది నేనుగాని సేవకుడు కాదు కదా! అయినా నా కంటె మించిన దైవ సేవకుడు మరెవరున్నారు?" అని జవాబిచ్చారు హజరత్ ఉమర్ (రజి). ఒంటె దొరికే వరకు ఆయనకు మనశ్శాంతి లేకుండా పోయింది.

## దైవధర్మం పట్ల అవగాహన

దైవధర్మం విషయంలో హజరత్ ఉమర్ (రజి)గారి అవగాహనా శక్తి చాలా గొప్పది. బాగా ఆలోచించాక సమాధానమిచ్చేవారు. దానికిక తిరుగుండదు. ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు ఆయన ఇచ్చిన సలహాలు అటు అల్లాహ్‌కూ నచ్చాయి, ఇటు ధార్మిక చట్టాలుగా కూడా రూపొందాయి. ఉదాహరకు ఇవి చూడండి:

1. అజాన్ పద్ధతి కోసం ఆయనిచ్చిన సలహా ధార్మిక చట్టం అయింది.

2. బదర్ యుద్ధంలో పట్టుకోబడిన ఖైదీల విషయంలో ప్రియప్రవక్త (సఅసం)వారినేం చేయాలి అని సలహా అడిగారు. అప్పుడు హజరత్ ఉమర్ (రజి) ఇచ్చిన సలహా అల్లాహ్‌కు నచ్చింది. ఆ విషయంలో దైవాదేశం అవతరించబడింది కూడ.

3. మద్యపానాన్ని నిషేధించాలని దైవప్రవక్త (సఅసం)కు సలహా ఇచ్చారు. కొన్నాళ్ళ తరువాత దాన్ని గురించే దైవాజ్ఞ అవతరించింది.

4. హజరత్ ఉమర్ (రజి) ప్రియప్రవక్త (సఅసం)కు సలహా ఇస్తూ, ఆయన (సఅసం) భార్యలను ప్రతి ఒక్కరి ముందుకు పరదా లేకుండా రానివ్వకండని అన్నారు. దాని ప్రకారమే దైవాజ్ఞలు అవతరించాయి.

5. హజరత్ ఉమర్ (రజి) ప్రియప్రవక్త (సఅసం)కు మరో సలహా

ఇస్తూ, కాబాగృహంలోని "ముఖామె ఇబ్రాహీం" అనే చోటును నమాజు చేయించే స్థలంగా నిర్ణయిస్తే బాగుంటుందని అన్నారు. కొన్నాళ్ళ తరువాత ఆ సలహా ప్రకారం దైవాజ్ఞ కూడ వచ్చింది.

## నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడటం

హజరత్ ఉమర్ (రజి) కుమారుడు అబూషహ్మా ఈజిప్టులో ఉన్నప్పుడు ఒకసారి పొరపాటున మద్యం సేవించాడు. అక్కడి గవర్నరు హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) అతణ్ణి తన ఇంటికి పిలిపించి తగిలీ తగలనట్టు మెల్లగా కొరడా దెబ్బలు కొట్టారు. హజరత్ ఉమర్ (రజి)కు ఆ విషయం తెలిసి "అమ్ర్ బిన్ ఆస్! నా ఆజ్ఞకు వ్యతిరేకంగా అమలుచేసే ధైర్యం నీకెక్కడ నుండి వచ్చింది?" అని చీవాట్లుపెడ్తూ లేఖ వ్రాశారు. "అమీరుల్ మోమినీన్ కుమారుడని దయతలుస్తూ ఇంటికి రప్పించి రహస్యంగా తగలీతగలనట్టు కొరడాతో మెల్లగా కొట్టిస్తావా? ఇతరులపట్ల ఎలా ప్రవర్తిస్తున్నావో అలాగే ఇతణ్ణి కూడ శిక్షించాలి కదా! అతణ్ణి నా వద్దకు పంపండి, తగిన విధంగా నేను శిక్షస్తాను" అని ఆ లేఖలో వ్రాశారు.

అబూషహ్మా హజరత్ ఉమర్(రజి) దగ్గరకు వచ్చి ఏడ్వనారంభించారు. "నాన్నగారూ! నేనిప్పుడు అనారోగ్యంగా ఉన్నాను. నన్ను మళ్ళీ రెండవసారి శిక్షించకండి" అన్నాడతను బాధపడుతూ. అక్కడున్న ఇతర సహాబీలు కూడా ఈమాటే చెప్పి అతడ్ని శిక్షించవద్దని సలహా ఇచ్చారు. కాని హజరత్ ఉమర్ (రజి) ఎవరి మాటా ఖాతరుచేయకుండా చట్టం ప్రకారం అందరి సమక్షంలో తనయుడ్ని శిక్షించారు. దాంతో అబూషహ్మా వ్యాధి తీవ్రమయి ఒక నెల తరువాత చనిపోయాడు.

## ఆయన సాధించిన ఘనకార్యాలు

పధ్నాలుగు వందల సంవత్సరాలకు పూర్వం హజరత్ ఉమర్ (రజి) స్థాపించిన రాజ్య విధానం ఈనాటికీ మానవాళికి అన్ని విధాలా ఆదర్శ ప్రాయమయిఉంది. అది మనకు మార్గదర్శకంగా ఉంది. సాధారణ పౌరులే కాదు, మేటి రాజకీయనాయకులు కూడ చరిత్ర పుటలు తిరగేస్తూ ఆయన

సాధించిన ఘన కార్యాలు చదువుతుంటే దిగ్భ్రాంతి చెందుతారు. పైగా ఆ నాయకులు తమ అనుచరులకు "మీరు పరిపాలన చేయాలనుకుంటే ఉమర్ (రజి) చేసినటువంటి పరిపాలన చేయాలి; ఆయన కాలంలో పులి, మేక ఒకే చోట నీరు త్రాగేవి; బలవంతుడు బలహీనుడిపై చేయిచేసుకోవడానికి సాహసించలేడు" అని చెప్పవలసి వస్తుంది.

రండి! ఆ ఆదర్శ సామ్రాజ్యంలోని కొన్ని విషయాలను తెలుసుకుందాం. ఇస్లాం ఒక మతం మాత్రమే కాదు. కేవలం అది పూజాపురస్కారాల పద్ధతులనే తెలియజేయలేదు. రాజకీయ సూత్రాలను, ఆదర్శవంతమైన పరిపాలనా విధానాన్ని కూడా మనకు నేర్పింది. ఈ వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకోవాలి.

## రాజ్య విస్తరణ

హజరత్ ఉమర్ (రజి) కాలంలో మొత్తం 1036 పట్టణాలు వశమయ్యాయి. ఈ క్రింది రాజ్యాలు ఇస్లామి సామ్రాజ్యంలో కలిసిపోయాయి. అరబ్ ఇరాఖ్, అరబ్బేతర ఇరాఖ్, అల్జీరియా, ఈరాన్, ఆర్మీనియా, ఆజర్‌బాయిజాన్, సేస్తాన్, ఖురాసాన్, ఖజకిస్తాన్, కిర్మాన్, మక్రాన్, బెలూచిస్తాన్‌లో కొంత భాగం, సింధ్‌లో కొంత భాగం (సముద్రతీర ప్రాంతాలయిన దేబల్, థాన), సిరియా, పాలస్తీనా, ఈజిప్టు.

హజ్రత్ ఉమర్ (రజి) పాలనాకాలంలో ఇస్లామీయరాజ్యం బాగా విస్తరించింది. అందువల్ల పరిపాలనా సౌలభ్యం కోసం మొత్తం రాజ్యాన్ని 13 రాష్ట్రాలుగా విభజించడం జరిగింది. ప్రతి రాష్ట్రానికి ఒక పాలకుడు ఉండేవాడు.

మక్కా, మదీనా, సిరియా, అల్జీరియా, బస్రా, కూఫ, పాలస్తీన (ఇది రెండు భాగాలు వాటి ముఖ్యపట్టణాలు ఏలియా, రమలా); ఈజిప్టు ఎగువభాగం, ఈజిప్టు దిగువభాగం; ఖురాసాన్, ఆజర్‌బాయిజాన్, పారసీకము (ఈరాన్).

హజరత్ ఉమర్ (రజి) అధీనంలోని మొత్తం దేశాల విస్తీర్ణం 22,51,030 చదరపు మైళ్ళు. (ఇరవై రెండు లక్షల యాభై ఒక్క వేల ముప్ఫయి చదరపు మైళ్ళు).

## రాష్ట్రాల పాలనా వ్యవస్థ

రాష్ట్రాల పాలనా వ్యవస్థలను సరైన రీతిలో నిర్వహించడానికి హజ్రత్ ఉమర్ (రజి) ప్రతి రాష్ట్రంలో క్రింద పేర్కొన్న ఉన్నతాధికారులను నియమించారు.

1. **వాలి (గవర్నర్):** ఇతను మొత్తం రాష్ట్రానికి ప్రధాన పాలకుడు. రాష్ట్ర పాలనావ్యవస్థలో ఎక్కడ ఏ సమస్య ఏర్పడినా దానికి అతనే బాధ్యుడు.

2. **కాతిబ్ (ప్రధాన కార్యదర్శి):** రాష్ట్రంలో జరిగే ప్రభుత్వ కార్యకలాపాలను ఎప్పటికప్పుడు వ్రాసి రాష్ట్ర గవర్నర్‌కు సమర్పిస్తూ ఉంటాడు.

3. **కాతిబె దివాన్ (రక్షణశాఖ కార్యదర్శి):** సైన్యానికి కావలసిన అవసరాలన్నిటిని దృష్టిలో పెట్టుకొని వాటిని గురించి వివరాలను సేకరించడం ఇతని బాధ్యత.

4. **సాహబె ఖిరాజ్:** అంటే కలెక్టర్ లేక రెవెన్యూ అధికారి అన్నమాట. జకాత్, జిజియా, పన్నుల వ్యవస్థను పర్యవేక్షిస్తూ వాటి జమా ఖర్చులు వ్రాయడం ఇతని పని.

5. **సాహబె అహ్‌దాస్:** అంటే పోలీసు ఆఫీసరు. ఇతను యావత్తు రాష్ట్ర పోలీసుల ఉన్నతాధికారి. రాష్ట్రంలో శాంతి భద్రతలను కాపాడటం ఇతని బాధ్యత.

6. **సాహబె బైతుల్‌మాల్:** ఇతను రాష్ట్ర కోశాధికారి. రాష్ట్ర ఆదాయ వ్యయాలను పర్యవేక్షించడం, వాటి జమాఖర్చులు వ్రాయడం ఇతని బాధ్యతలు.

7. **ఖాజీఉల్ ఖజాఅత్:** అంటే ప్రధాన న్యాయమూర్తి. ప్రజల ఫిర్యాదులను స్వీకరించి షరియత్ ప్రకారం విచారించి తీర్పుచెప్పడం ఇతని బాధ్యత.

## పోలీసు ఆఫీసరు బాధ్యత

పోలీసు ఆఫీసరు (సాహబె అహ్‌దాస్) రాష్ట్రంలో శాంతి భద్రతలను కాపాడటం తోబాటు ప్రజల కార్యకలాపాలను కూడా ఓ కంట కనిపెడ్తుండాలని

అతనికి ప్రత్యేక ఆదేశాలివ్వబడ్డాలి. ఉదాహరణకు: వ్యాపారస్థులు తూనికల్లో, కొలతల్లో మోసం చేస్తున్నారేమో గమనించి, తగిన చర్యలు తీసుకోవాలి. అలాగే దండీ కొట్టకుండ తూకాలను సరిగ ఉపయోగిస్తున్నారా లేదా చూడాలి. ఎవరైనా వచ్చేపోయే దారిలో ఇల్లు కడ్తున్నాడా, పశువులపై మితిమీరిన బరువు మోపి వాటిని వేధిస్తున్నాడా, మద్యపానం బహిరంగంగా అమ్మబడుతుందా మొదలైన అక్రమాలను పర్యవేక్షిస్తుండాలి. ప్రజాసంబంధ వ్యవహారాలు, ధర్మశాస్త్రానికి వ్యతిరేకమైన విషయాలను గురించి శ్రద్ధ తీసుకొని పనిచేయడం కూడా రాష్ట్రపోలీసు ఉన్నతాధికారి భాధ్యతే.

హజరత్ ఉమర్ (రజి) కేవలం ఆజ్ఞలు జారీ చెయ్యడమే కాకుండ వాటిని సంబంధిత అధికారులు ఆచరణలో పెడ్తున్నారా లేదా అనే విషయాన్ని కూడా పర్యవేక్షించేవారు. అందువల్లనే ఆయన ఖిలాఫత్ పదవి కాలంలో మొత్తం దేశ పాలనావ్యవస్థ అతిచక్కగ నడిచేది. ఈ కారణంగానే ఈనాటి గొప్ప గొప్ప నాయకులు ఉమర్ (రజి) రాజ్యపాలనా విధానాన్ని ఆదర్శప్రాయమైన పాలనా విధానంగా పేర్కొంటారు.

## కారాగారం, ధనాగారం

హజరత్ ఉమర్ (రజి) పరిపాలనకు ముందు అరేబియాలో జైళ్ళ ప్రసక్తే లేదు. ఆయన మొట్టమొదట మక్కా పట్టణంలో సఫ్వాన్ బిన్ ఉమయ్యాగారి ఇంటిని నాలుగువేల దిర్హములకు కొని, దానిని జైలుగా మార్చారు. ఆ తరువాత ఇతర జిల్లాలలో కూడ జైళ్ళు ఏర్పాటు చేశారు.

దేశ బహిష్కరణ శిక్షను కూడ ఆయనే కనిపెట్టారు. ఎవరైనా స్వదేశానికి ముప్పుగా తయారయితే, ఎంత నచ్చ చెప్పినా, శిక్ష విధించినా ప్రయోజనం లేనప్పుడు అతణ్ణి స్వస్థలం నుండి బహిష్కరించేవారు.

హజరత్ ఉమర్ (రజి) హయాంకు పూర్వం శాశ్వతమైన ధనాగారమేదీ ఉండేది కాదు. హజరత్ అబూబకర్ (రజి) ఈ పని కోసం ఒక ప్రత్యేక గృహాన్ని కేటాయించుకొన్నారు. కాని అది ఎప్పుడూ మూతపడే ఉండేది. హిజ్రీశకం 15 వ సంవత్సరంలో హజరత్ ఉమర్ (రజి) సలహా మండలి ఆమోదం తరువాత

మదీనాలో ఒక పెద్ద ధనాగారం స్థాపించారు. ప్రతి జిల్లాలోను దాని శాఖలు తెరిపించారు.

## ప్రజా ప్రభుత్వం

హజరత్ ఉమర్ (రజి) ఖిలాఫత్ ప్రభుత్వం నిజానికి ప్రజాప్రభుత్వం అనాలి. ఇక్కడ ప్రతి పని పరస్పర సలహాసంప్రదింపులతో జరుగుతుంది. హజరత్ ఉమర్ (రజి) ఒక కమిటీని ఏర్పాటు చేశారు. దాని పేరు మజ్లిసె షూర (సలహా మండలి). ముహాజిర్లు, అన్సార్లలోని వివేచనాపరులు, బుద్ధిమంతులు 'షూర' మెంబర్లుగ చేయబడేవారు. అన్ని సమస్యలు ఆ సలహా మండలిలో చర్చించబడేవి. సుదీర్ఘ చర్చల తరువాత నిర్ణయం తీసికోబడేది. ప్రతి వ్యక్తికి తన అభిప్రాయం తెలియజేసే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండేవి. ఆ సలహా మండలిలోని కొందరి ప్రముఖుల పేర్లు:

హజరత్ ఉస్మాన్ (రజి), హజరత్ అలి (రజి), హజరత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అవుఫ్ (రజి), హజరత్ మాఅజ్ బిన్ జబల్ (రజి), హజరత్ ఉబయి బిన్ కాఅబ్ (రజి), హజరత్ జైద్ బిన్ సాబిత్ (రజి). ఇదే కాకుండ ఒక సర్వసభ్యమండలి కూడ ఉండేది. ఇందులో ముహాజిర్లు, అన్సార్లు మాత్రమే కాకుండ ఇతర తెగల సర్దార్లు కూడ ఉండేవారు. అతి ముఖ్యమైన సమస్యలు ఈ మండలిలో చర్చించబడేవి. కాని దైనందిక వ్యవహారాలకు సంబందించి నిర్ణయాలు మజ్లిసె షూర (సలహా మండలి)లోనే తీసుకుంటారు. ఈ రెండు కమిటీలే కాకుండ మరో కమిటీ కూడా ఉండేది. దీనిని మజ్లిసె ఖాస్ (ప్రత్యేక మండలి) అనేవారు. అందులో ముహాజిర్ సహాబీలు మాత్రమే ఉండేవారు.

ఈ విధంగ ప్రభుత్వ నిర్ణయాలన్ని ప్రజల సలహాలతోనే చేయబడేవి. ఇలాంటి ప్రభుత్వాన్నే ప్రజాప్రభుత్వం అంటారు.

## ప్రజాప్రభుత్వాన్ని గుర్తించడం

ప్రజాప్రభుత్వం అంటే ఏమిటి? దాన్ని ఎలా గుర్తించగలం? హజరత్ ఉమర్ (రజి) ప్రభుత్వంలో రాజ్యాధినేత ఏదైనా తప్పు చేస్తే ప్రజలలో ప్రతి

ఒక్కరికి విమర్శించే, ఆ తప్పును ఎత్తిచూపే హక్కు వుంది. ఏదైనా విషయంలో తనకు సందేహం కలిగితే వెంటనే తన తప్పు ఎత్తి చూపండని హజ్రత్ ఉమర్ (రజి) ప్రజలకు అనుమతి ఇచ్చారు.

ఒకసారి ఒక వ్యక్తి వచ్చి "ఉమర్! దైవానికి భయపడు" అని అనేకసార్లు అన్నాడు. అప్పుడు సమావేశంలో ఒకతను లేచి "ఇక చాలు, ఊరుకో" అన్నాడు. హజరత్ ఉమర్ (రజి) జోక్యం చేసుకొంటూ "వారించకు. అతడ్ని చెప్పనివ్వు. ప్రజలు చెప్పకపోతే వారివల్ల ప్రయోజనం ఉండదు. మేము వారి మాటలు వినకుండ, వారు చెప్పేది పాటించకపోతే మా పరిపాలన వృధా అవుతుంది" అని అన్నారు.

చూశారా! ఆ మాటల ప్రభావం! ఈ విధంగ పాలకులు, పాలితుల హక్కులు, పరిమితులు అందరికీ అర్థమయిపోయాయి.

## తప్పు చేస్తే విమర్శించే స్వేచ్ఛ

ఇలాంటి మరో సంఘటన ఉంది. ఒకసారి హజరత్ ఉమర్ (రజి) మసీదు వేదిక ఎక్కి ప్రసంగిస్తూ "నేను మీకు కొన్ని విషయాలు చెప్పదలచాను. వాటి ప్రకారం మీరు ఆచరిస్తారా?" అని అడిగారు. జనసమూహంలో ఒక వ్యక్తి లేచి "మేము మీరు చెప్పే మాటలేమీ వినం. మీరు న్యాయంగా వ్యవహరించలేదు" అన్నాడు చాలా ఆవేశంగా. సమావేశంలో సర్వత్రా నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. హజరత్ ఉమర్ (రజి) "అసలు విషయమేమిటి?" అని అడిగారు. దానికా వ్యక్తి ఇలా సమాధానమిచ్చాడు: "కొన్నాళ్ళ క్రిందటి మాట. యుద్ధసొత్తు (మాలె గనీమత్)లో లభించిన దుప్పట్లు కొన్ని వచ్చాయి. వాటిని మసీదు ప్రాంగణంలో ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున పంచబడ్డాయి. న్యాయంగ చూస్తే మీరు కూడా ఒక్కటే తీసికోవాలి. కాని ఈరోజు మీరు తొడుకున్న చొక్కా ఆ దుప్పటిదే. ఒక దుప్పటితో అంత పెద్ద చొక్కా కుట్టడం అసంభవం. దీనిని బట్టి మీరు రెండు దుప్పట్లు తీసుకున్నట్లు తెలుస్తోంది. ఇది న్యాయమేనా?"

ఈ అభ్యంతరానికి హజరత్ ఉమర్ (రజి) కోపగించుకోలేదు. తన కొడుకు హజరత్ అబ్దుల్లాహ్‌ను సంబోధిస్తూ: "నాయనా! నా తరపున నీవు దీనికి సమాధానం ఇవ్వు. ఈయన అపోహ దూరమౌతుంది" అన్నారు. హజరత్ అబ్దుల్లాహ్ లేచి నిలబడి ఇలా అన్నారు: "మా నాన్నగారు కూడ ఒక్క దుప్పటే తీసుకున్నారు. దానితో ఆయన చొక్కా కుట్టించదలిచారు. కాని అది సరిపోలేదు. అప్పుడు నేను నా వాటాకు వచ్చిన దుప్పటిని నాన్నగారికి ఇచ్చాను. ఆయన దుప్పటి, నా దుప్పటి రెండిటిని కలిపి చొక్కా కుట్టించుకొన్నారు." ఈ జవాబు విని అభ్యంతరం తెలిపిన వ్యక్తి సంతృప్తిచెందాడు.

## ఒక మహిళ అభ్యంతరం

ఏ విషయంలోనైనా విమర్శించే, అభ్యంతరం తెలిపే హక్కు పురుషులకే కాకుండా మహిళలకు కూడా ఉండేది.

ఒకసారి హజరత్ ఉమర్ (రజి) మహర్ ఎంత చెల్లించాలనే విషయంపై ప్రసంగిస్తున్నారు. ఉపన్యాసం మధ్యలో ఒక స్త్రీ అభ్యంతరం తెలుపుతూ "ఉమర్! దైవానికి భయపడు. మహర్ పరిమితి ఇంత ఉండాలని దైవప్రవక్త (సల్లం) నిర్ణయించనప్పుడు మధ్యలో మీరెవరు మహర్ పరిమితి నిర్ణయించడానికి?" అని నిలదీసింది.

ఆమె అభ్యంతరం నిజమయినదే. హజరత్ ఉమర్ (రజి) ఆమె అభ్యంతరాన్ని అంగీకరిస్తూ "ఒక స్త్రీ కూడా ఉమర్ కంటె ఎక్కువ జ్ఞానం కలిగి ఉంటుంది" అని అన్నారు.

చూశారా! ఆ మహనీయుడు ప్రజలకు ఇచ్చిన స్వేచ్ఛా సమానత్వాలు!! అందువల్లనే ఆయన ఖిలాఫత్ పాలన విజయవంతంగా సాగి ప్రసిద్ధిచెందింది.

## వ్యవసాయ పురోభివృద్ధి

హజరత్ ఉమర్ (రజి) వ్యవసాయాభివృద్ధికి చాల ప్రయత్నం చేశారు. రైతులకు అనేక సదుపాయాలు కల్పించారు. భూములు సాగుబడి చేసే

విషయంలో వారి సలహాలు తీసుకునేవారు. నీటి పారుదల కోసం యావత్తు దేశంలో కాలువలు త్రవ్వించారు. పెద్ద నదుల నుండి కాలువలు త్రవ్వించి, సుదూర ప్రాంతాలకు సైతం నీరందే ఏర్పాట్లు చేశారు. ఇన్ని సదుపాయాలు కల్పించినప్పటికీ వెనుకటి ప్రభుత్వాలకంటె తక్కువ శిస్తు వేయడం జరిగింది. ఈ కారణంగానే వ్యవసాయదారులు ఇస్లామీయ ప్రభుత్వానికి నిజమైన శ్రేయోభిలాషులయ్యారు.

వ్యవసాయదారులకు ఎలాంటి అన్యాయం జరిగినా వెంటనే హజరత్ ఉమర్ (రజి) తగిన చర్య తీసుకునేవారు. ఒకసారి సిరియాకు చెందిన ఒక రైతు వచ్చి "మీ సైన్యం నా పొలాల గుండా పోతూ మొత్తం పంటను సర్వ నాశనం చేసిపోయింది" అని ఫిర్యాదు చేశాడు. హ్రజత్ ఉమర్ (రజి) వాస్తవం రాబట్టిన తరువాత నష్టపరిహారం క్రింద ఆ వ్యవసాయదారునకు పదివేల దిర్హములు డబ్బు ఇప్పించారు.

చూశారా! ఎంత త్వరగా ఆ రైతుకు జరిగిన నష్టాన్ని తీర్చారో హజరత్ ఉమర్ (రజి)!!

## ఆయనొక మంచి సేనాధిపతి

హజరత్ ఉమర్ (రజి) కేవలం అత్యంత సమర్థుడైన పాలకుడే కాదు, తన కాలంలో మంచి సేనాధిపతిగా కూడా రాణించారు. ఖిలాఫత్ ప్రారంభ కాలంలో సిరియా, ఇరాఖ్, ఈరాన్, ఈజిప్టు వగైరా దేశాలలో ముస్లింలతో యుద్ధాలు జరుగుతుండేవి. వందలాది మైళ్ళ దూరంలో ఉండి కూడ హజరత్ ఉమర్ (రజి) యుద్ధవ్యూహాలను రచిస్తూ సైనికులకు తగిన ఆదేశాలు ఇస్తుండేవారు.

యుద్ధానికి పోయే ప్రతి సేనాపతీ యుద్ధ పరిస్థితితో పాటు అక్కడి వార్తలు, విశేషాలు ఎప్పటికప్పుడు ఖలీఫా కార్యాలయానికి తెలియజేస్తుండాలని హ్రజత్ ఉమర్ (రజి) ఉత్తర్వు జారీచేశారు. ఆ విధంగా సేనాపతులు పంపిన నివేదికలను చదివి పరిస్థితులకు అనుగుణంగా వారికి తగిన సలహాలు,

సూచనలు ఇచ్చేవారు ఆయన. సేనాపతులు వాటి ప్రకారం నడుచుకుంటూ యుద్ధాలు చేసి విజయాలు సాధించేవారు.

ఈ విధంగ హజరత్ ఉమర్ (రజి) ఆనాడు జరిగిన యుద్ధాలన్నిటినీ స్వయంగా పర్యవేక్షించారు. నిజంగా హజరత్ ఉమర్ (రజి) మంచి పాలకుడు కావడంతో పాటు, సమర్థుడైన సైన్యాధిపతి కూడా.

## ఖాజీల నియామకం

హజరత్ ఉమర్ (రజి) ఎంతో న్యాయప్రియుడు, న్యాయశీలుడు. ఆయన న్యాయశీలత ఈనాటికీ ప్రశంసించబడుతోంది. ధనవంతుడైనా, బీదవాడైనా, పాలకుడైనా, పాలితుడైనా, తనవారయినా, పరాయివారయినా అందరిపట్ల ఒకే రీతిన ప్రవర్తించేవారు హజరత్ ఉమర్ (రజి).

హజరత్ ఉమర్ (రజి) ఎవరినైనా ఖాజీగా (న్యాయాధికారిగా) నియమించే ముందు అతడ్ని పరీక్షించేవారు. ఖాజీ షరయి అనే న్యాయాధికారికి సంబంధించిన ఒక సంఘటన చాలా ప్రసిద్ధిచెందింది. మీరూ వినండి:

తనకు నచ్చింది కావాలనే షరతుపై హజరత్ ఉమర్ (రజి) ఒక గుర్రాన్ని కొన్నారు. పరీక్షించేందుకు దానిపై ఎక్కి స్వారి చేశారు. కాని యాదృచ్ఛికంగా ఆ గుర్రం కాలుజారి పడిపోయింది. దానికి గాయం కూడా అయింది. హజరత్ ఉమర్ (రజి) ఆ గుర్రాన్ని అమ్మినవాడికి తిరిగిచ్చేద్దాం అనుకున్నారు. కాని అతనా గుర్రాన్ని వాపసు తీసుకోవడానికి నిరాకరించాడు. తరువాత ఇద్దరూ కలిసి ఇరాఖ్‌కు చెందని ఒక న్యాయాధికారి దగ్గరకు తీర్పు కోసం వెళ్ళారు. ఆయన కేసు విని ఎలాంటి మొహమాటం లేకుండా ఇలా తీర్పిచ్చాడు: "అమీరుల్ మోమినీన్! మీరు ఈ గుర్రాన్ని కొనుక్కోండి. లేదా మీరు తీసుకున్నప్పుడు గుర్రం ఏ విధంగా ఉండిందో అదే స్థితిలో దాన్ని ఇతనికి వాపసు చేయండి."

హజరత్ ఉమర్ (రజి) ఈ తీర్పు విని చాలా సంతోషించారు. ఆయన ఆ న్యాయాధికారిని కూఫా ప్రాంతపు ఖాజి (జడ్జీ)గా నియమించారు. కూఫాలో

ఆయన అరవై యేళ్ళదాకా అదే హోదాలో ఉండి ఖాజీ షరయి పేరుతో ప్రఖ్యాతిగాంచారు.

## హితోక్తులతో కూడిన లేఖ

హజరత్ ఉమర్ (రజి) గొప్ప న్యాయశీలుడని, అన్యాయం అంటే ఆయనకు కాస్త కూడా గిట్టదని మీరు లోగడ తెలుసుకున్నారు. ఈ విషయంలో హజరత్ ఉమర్ (రజి) హజరత్ అబూమూసా అష్అరీ (రజి)కు ఒక ఉత్తరం వ్రాశారు. ఆయనెవరో సాధారణ మనిషి కాదు. ప్రియప్రవక్త (సఅసం) సహచరులలో ఒకరు. బస్రా ప్రాంతపు పాలకుడు కూడ. ఆ ఉత్తరంలోని ప్రతి ఉపదేశం ఎంతో అమూల్యమైంది. ఉత్తరంలోని సారాంశం చూడండి:

"ఫిర్యాదులను పరిష్కరించడం ఎంతో బాధ్యతతో కూడిన పని. ఏదైన ఫిర్యాదు మీకందితే, అందులోని ప్రతి మాటను క్షుణ్ణంగా పరిశీలించి, బాగా ఆలోచించి తీర్పునివ్వండి, తీర్పు ఇచ్చాక దాని ప్రకారం అమలు కూడా చేయాలి. ఫిర్యాది, ముద్దాయిల పట్ల ఒకే విధంగా వ్యవహరించాలి. ఫిర్యాది నుండి సాక్ష్యం అడగాలి. 'దావా'ను నిరాకరించేవారి చేత ప్రమాణం చేయించండి. ముస్లింల మధ్య రాజీ కుదర్చడం చాలా మంచిది. ఫిర్యాది తన 'దావా'ను నిరూపించుకోడానికి వ్యవధి అడిగితే ఇవ్వండి. సాక్ష్యం తెస్తే దాని ఆధారంగా తీర్పు చేయండి. ఫిర్యాది సాక్ష్యం సమర్పించకపోతే ఆ కేసును కొట్టివేయండి. ప్రతి ముస్లింని నిజం చెప్పేవాడని భావించండి. అయితే ఏదైన విషయంలో శిక్ష పడి ఉంటే లేదా తప్పుడు సాక్ష్యమిచ్చి ఉంటే అతని మాటలు నమ్మదగినవికావు. ముద్దాయి లేదా ఫిర్యాది పట్ల మీ హృదయంలో ఏమాత్రం కోపంగాని, విసుగుగాని ఉండరాదు. ఎందుచేతనంటే న్యాయశీలుడు దైవబహుమానానికి, మంచి పేరు ప్రతిష్ఠలకు హక్కుదారుడౌతాడు. నిష్కల్మషమైన మనస్సు కలవాడికి, ప్రజలకు మధ్య అల్లాహ్ చాలు. కృత్రిమ నైతికతను ప్రదర్శించేవాడు ఎన్నటికీ దేవుని కారుణ్యానుగ్రహాలను ఆశించలేడు."

తీర్పు విషయంలో న్యాయాధిపతి పాటించాల్సిన సూత్రాలను ఎంత చక్కగ హజరత్ ఉమర్ (రజి) తెలిపారో చూశారా! ఈనాడు కూడ ఆ సూత్రాలను

పాటిస్తుంటే ఏ ఒక్కరూ తన హక్కును కోల్పోలేడు, ఎవరికీ ఎలాంటి అన్యాయం జరగదు.

## న్యాయం దృష్టిలో అందరు సమానులే

ఇలాంటిదే మరో సంఘటన ఉంది. హజరత్ ఉమర్ (రజి), ఉబయి బిన్ కాబ్ (రజి)ల మధ్య ఏదో విషయంలో వివాదం వచ్చింది. హజరత్ ఉబయి బిన్ కాబ్ (రజి) ఈ వ్యవహారాన్ని హ్రజత్ జైద్ బిన్ సాబిత్ (రజి) దగ్గరకు తీసికెళ్ళారు. ఫిర్యాదు చేశారు. హజరత్ ఉమర్ (రజి) ముద్దాయిగ హాజరయ్యారు. ఖలీఫా అయినందున ఆయన్ని హజరత్ జైద్ (రజి) గౌరవంతో కూర్చోబెట్టదలిచారు. హజరత్ ఉమర్ (రజి) అందుకు అభ్యంతరం తెలుపుతూ "జైద్! ఇది నీ మొదటి అన్యాయం" అన్నారు. అలా చెప్పాక ఆయన వెళ్ళి హజరత్ ఉబయి బిన్ కాబ్ ప్రక్కన కూర్చున్నారు. ఉబయి బిన్ కాబ్ వద్ద ఎలాంటి సాక్ష్యం లేదు. హ్రజత్ ఉమర్(రజి) ఆయన దావాను నిరాకరించారు. న్యాయశాస్త్రం ప్రకారం ఉబయి బిన్ కాబ్ (రజి) హజరత్ ఉమర్ (రజి) చేత ప్రమాణం చేయించ దలిచారు. కాని హజరత్ జైద్ (రజి) హజరత్ ఉమర్ (రజి) హోదాను దృష్టిలో ఉంచుకొని హజరత్ ఉబయి బిన్ కాబ్ (రజి)తో "అమీరుల్ మోమినీన్ గారికి ప్రమాణం నుంచి మినహాయింపు ఇవ్వండి" అని అడిగారు. హజరత్ జైద్ (రజి) ప్రదర్శించిన ఈ రెండవ పక్షపాత వైఖరి చూసి హజరత్ ఉమర్ (రజి)కు బాధ వేసింది.

"జైద్! న్యాయం చేసేటప్పుడు ధనవంతుడు, నిరుపేద, సాధారణ వ్యక్తి, ఉమర్ (రజి) నీ దృష్టిలో సమానులు కానంతవరకు నీవు ఖాజీ పదవికి అర్హుడవని భావించలేము" అన్నారు ఆయన.

## సైన్యంలో భారత దళం

హజరత్ ఉమర్ (రజి) సైనిక వ్యవస్థ పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించారు. దేశంలో అనేక చోట్ల సైనిక స్థావరాలు నెలకొల్పారు. సైనికులు నివసించడానికి బ్యారెక్స్‌లను నిర్మించారు. గుర్రాలను ఉంచడానికి అశ్వశాలలు నిర్మించారు. మిలటరీ కార్యాలయాలు ఏర్పాటు చేశారు. అక్కడ సైనికుల సౌకర్యార్థం

ధాన్యం వగైరా ఆహార పదార్థాలు ఉండేవి. ఈ విధంగా ఆయన సైనికుల కోసం అనేక సదుపాయాలు, ఏర్పాట్లు చేశారు.

ఈరాన్ చక్రవర్తి యజ్దగిర్ద్ వద్ద సింధూ ప్రాంతపు జాట్ కులానికి చెందిన హిందూ సైనికదళం కూడా ఒకటుండేదని చెబుతారు. సోస్ యుద్ధంలో ఈరానీయులు పరాజయమొంది పారిపోయినప్పుడు ఈ హిందూ సైనికులు ప్రాణాల్ని కాపాడుకోవడానికి పారిపోలేదు. వారు పరస్పరం ఆలోచించుకొని ఇస్లాం స్వీకరించి ముస్లిం సైన్యంలో చేరిపోయారు. వీరికి బస్రా పట్టణంలో పునరావాసం కల్పించారు అరబ్బులు వీరిని 'నత్' అని పిలిచేవారు. వారు చరిత్రలో అదే పేరున ప్రసిద్ధులయ్యారు.

## న్యూస్ మీడియా

ఇస్లామీయ సామ్రాజ్యం సుదూర ప్రాంతాల వరకు వ్యాపించింది. ఫారూఖి సైన్యం దేశమంతటా విస్తరించి ఉంది. రాజధాని నగరం మదీనా నుండి సైనికులు వేల మైళ్ళ దూరంలో ఉన్నప్పటికీ హజరత్ ఉమర్ (రజి) ప్రతి సైన్యం, ఆ సైన్యం సేనాపతి గురించి పూర్తి సమాచారం ఎప్పటికప్పుడు రాబట్టేవారు. ఏ సైనికపటాలం ఎటువైపు పురోగమిస్తోంది, ఏం జరుగుతోంది, అది ఎలాంటి ఇబ్బందులను ఎదుర్కొంటోంది మొదలైన ప్రతి చిన్న విషయం ఆయనకు తెలిసేది. అలా లభించిన సమాచారాన్ని బట్టి ఆయన సూచనలు, సలహాలు ఇచ్చేవారు.

సమాచార సేకరణ కోసం హజ్రత్ ఉమర్ (రజి) సైన్యంలో కొంతమందిని నియమించారు. వారి పని ప్రతి దినం ఆయనకు వార్తలు పంపిస్తుంటారు. వార్తా సేకరణ ఏర్పాటుతోపాటు ఆయన గూఢచార శాఖను కూడ నెలకొల్పారు. జోర్డాన్, పాలస్తీనా ప్రాంతాల్లో ఉండే సామిరాకులం యూదులను ప్రత్యేకంగా గూఢచర్య కార్యకలాపాల కోసం నియమించారు. ఈ పనికి ప్రతిఫలంగ వారికి వ్యవసాయ భూములిచ్చారు. సవ్యమైన, సుస్థిరమైన పాలన సాగడానికి వీలుగా హజరత్ ఉమర్ (రజి) యావత్తు ఇస్లామీయ

రాజ్యంలో జరిగే విశేషాలు, స్థితిగతులను గురించి తెలుసుకునేందుకు పటిష్టమైన సమాచార వ్యవస్థను ఏర్పాటు చేశారు.

## విద్యాభివృద్ధి

హజరత్ ఉమర్ (రజి) విద్యాభివృద్ధి కోసం కూడా కృషి చేశారు. దేశమంతటా ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటు చేశారు. ఈ పాఠశాలల్లో ఖుర్ఆన్, హదీస్, ఫిఖ (ధర్మావగాహన శాస్త్రం) విద్యలు బోధించే ఏర్పాటు చేయించారు. దాని కోసం గొప్పగొప్ప ధర్మవేత్తలను ఉపాధ్యాయులుగా నియమించారు. వారికి మంచి జీతాలు కూడ ఇవ్వబడేవి. నబవీ మసీదులో బాలబాలికల కోసం ప్రయిమరీ పాఠశాలను స్థాపించారు. అక్కడ హజరత్ అబ్దుల్లా బిన్ ఖజాయి (రజి) విద్యాబోధన చేసేవారు. ఫజర్ నమాజు ముగిసిన కాస్సేపటి నుండి బారెడు పొద్దు ఎక్కేంత వరకు, మళ్ళీ జుహర్ నమాజు నుండి అసర్ నమాజు వరకు ఈ పాఠశాల నడిచేది.

ఒకసారి హజరత్ ఉమర్ (రజి) సిరియా వెళ్ళి తిరిగి వస్తూ మదీనాలో ప్రవేశించగానే పాఠశాల విద్యార్థులు ఆయనకు ఎదురేగి స్వాగతం చెప్పారు. ఆరోజు గురువారం. హజరత్ ఉమర్ (రజి) గురువారం అర్ధదినం, శుక్రవారం పూర్తి దినం సెలవు ప్రకటించారు. ఈనాటి వరకు మన ధార్మిక పాఠశాలల పని వేళలు, సెలవు దినాలు ఇవే కొనసాగుతున్నాయి.

## హిజ్రీ శకారంభం

హజరత్ ఉమర్ (రజి) పరిపాలనా కాలానికి పూర్వం సంవత్సరాలు లెక్క కట్టడానికి ఒక పద్ధతి అంటూ వుండేదికాదు. ఏదో ఒక ప్రత్యేక సంఘటన దగ్గర్నుంచి సంవత్సరం లెక్క కట్టేవారు. మాసాలు నిర్ణయమయి ఉండేవికాని, శకం ప్రస్తావన ఉండేదికాదు. హ్రజత్ ఉమర్ (రజి) ఖలీఫా అయిన తరువాత హిజ్రీశకం 16వ సంవత్సరంలో సంతకం కోసం ఆయన దగ్గరకు ఒక చెక్కు వచ్చింది. దాని మీద తేదీ అన్న చోట షాబాన్ నెల అని మాత్రమే వ్రాసి ఉంది. హ్రజత్ ఉమర్ (రజి)కు అనుమానం వచ్చింది. "ఇది గడచిపోయిన

సంవత్సరానికి చెందిన మాసమా లేక నడుస్తున్న సంవత్సరపు మాసమా? ఎలా తెలుసుకోవాలి?" అని ప్రశ్నించారు. అప్పటికప్పుడు ఆయన సలహామండలి సభ్యులను సమావేశపరచి వారి ముందు ఈ సమస్యను పెట్టారు. సభ్యులందరూ తేదీ, నెల, సంవత్సరం అన్నీ ఉండాలని అన్నారు. అయితే శకారంభం ఎప్పటి నుంచి లెక్క కట్టాలి అనే మరో సమస్య మిగిలి ఉంది. సభ్యులు తమతమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. కాని హజరత్ అలి (రజి) ఇచ్చిన సలహా అందరికి నచ్చింది. దైవప్రవక్త (సఅసం) మదీనాకు హిజ్రత్ (వలస) వచ్చినప్పటి నుండి సంవత్సరాల లెక్క ప్రారంభించాలని ఆయన అన్నారు.

ఈ విధంగా హిజ్రీ శకం ప్రారంభమయింది. ఈ హిజ్రీశకం మనకు ఎల్లప్పుడూ మన ప్రియప్రవక్త (సఅసం) హిజ్రత్ చేసిన ప్రముఖ చారిత్రక సంఘటనను గుర్తుచేస్తుంది.

## జిమ్మీల హక్కులు

ఇస్లాం మనకు జిమ్మీ (ముస్లిమేతరు)ల పట్ల సద్భావంతో మెలగాలని ఆజ్ఞాపించింది. వారి ధన మాన ప్రాణాలు, వారి ఆస్తులు, వారి మత సంప్రదాయాలను పరిరక్షించడం ఇస్లామీయ ప్రభుత్వం బాధ్యత. హజరత్ ఉమర్ (రజి) ఈ విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకునేవారు. రాష్ట్రాల గవర్నర్‌లకు దీన్ని గురించి ప్రత్యకంగా సూచనలు కూడా పంపుతుండేవారు. ఇవి మాటలకు, రాతలకు మాత్రమే పరిమితమయి ఉండలేదు. వాటిని పూర్తిగా అమలుపరచడం కూడా జరిగేది.

ఒకసారి బకర్ బిన్ వాయిల్ తెగకు చెందిన ఒక ముస్లిం హీరా ప్రాంతం నివాసి అయిన ఒక క్రైస్తవుణ్ణి హత్య చేశాడు. హజ్రత్ ఉమర్ (రజి) హంతకుణ్ణి, హతుని వారసులకు అప్పగించారు. వారతణ్ణి చంపి ప్రతీకారం తీర్చుకున్నారు.

ఇదే విధంగ జిమ్మీల వద్ద ముందునుండి ఉన్న భూములను వారి అధీనంలోనే ఉంచారు. వాటిని ఆక్రమించుకోవడానికి ఏ ముస్లింకూ అనుమతి లేదు.

పరిపాలనా వ్యవహారాల్లో జిమ్మీలకు సంబంధించిన విషయాలు ఉంటే వారితో సంప్రదించకుండా ఎలాంటి నిర్ణయం తీసుకునేవారు కాదు. ఈ కారణంగానే జిమ్మీలు తమ రాజ్యాలలో ఉండటానికి బదులు ఇస్లామీయ రాజ్యంలో ఉండటానికే ఎక్కువగా ఇష్టపడేవారు. ఇస్లామీయ రాజ్యంలో వారికి వారి హక్కులన్నీ పూర్తిగా లభించేవి. తమవారి రాజ్యాలలో ఈ హక్కులు లభించేవికావు.

## అమీరుల్ మోమినీన్ బిరుదు

ఒకసారి లబీద్ బిన్ రబియా (రజి), అద్దీ బిన్ హాతిం (రజి) మదీనా వచ్చారు. వారు హజ్రత్ ఉమర్ (రజి)ను కలుసుకోవడానికి వచ్చారు. వారు చాలా కాలం నుంచి కూఫాలో ఉండటం వల్ల వారి నాలుకలపై అమీరుల్ మోమినీన్ అనే పదం తిష్ఠవేసుకుంది. అంచేత వారు తమ రాక గురించి తెలియపరుస్తూ "అమీరుల్ మోమినీన్"కు చెప్పండి అని అన్నారు. ఆ విషయం తెలియజేయడానికి లోపలికి వెళ్ళిన మనిషి కూడా ఈ పదాన్నే ప్రయోగిస్తూ హజ్రత్ ఉమర్ (రజి)కు తెలియజేశాడు. హజ్రత్ ఉమర్ (రజి)కు ఆ పదం బాగా నచ్చింది. ఆరోజు నుంచి ఖలీఫాను "అమీరుల్ మోమినీన్" అని పిలిచే సంప్రదాయం ప్రారంభమయింది.

## నీటి సౌకర్యం

అరేబియాలో నీటి ఎద్దడి ఎప్పుడు ఉండేది. దానివల్ల ప్రజలు అనేక ఇబ్బందులకు గురికావలసి వచ్చేది. హజరత్ ఉమర్ (రజి) ప్రజల ఇబ్బందులు గమనించి నీటి సరఫరా వైపు ప్రత్యేకంగా దృష్టి కేంద్రీకరించారు. త్రాగునీటి సౌకర్యం కోసం కాలువలు త్రవ్వించారు. వ్యవసాయానికి నీటిపారుదల కాలువలు వేరే ఉండేవి.

1. **అబూమూసా కాలువ:** ఇది తొమ్మిది మైళ్ళ పొడవైన కాలువ. దజ్లా నది నుండి తీసి బస్రా పట్టణానికి తీసుకురావడం జరిగింది. దీనివల్ల పట్టణ ప్రజలందరికీ పుష్కలంగా నీరు లభించసాగింది.

2. **ముఅఖ్ఖల్ కాలువ:** ఈ కాలువ దజ్లా నది నుండి తీయబడింది.

**3. సాఅద్ కాలువ:** ఈ కాలువ త్రవ్వుతున్నప్పుడు దారిలో ఒక చోట కొండ అడ్డం వచ్చి పని ఆగిపోయింది. హజాజ్ బిన్ యూసుఫ్ కాలంలో అది పూర్తి చేయబడింది.

**4. ఉమర్ కాలువ:** ఇది అన్నిటికంటె పెద్ద కాలువ. చాల ప్రయోజన కరమైనది. దీన్ని నైలు నది నుండి తీసి మధ్యదరా సముద్రంలో కలిపేయడం జరిగింది. దీని పొడవు 69 మైళ్ళు.

## భవనాలు నిర్మించారు

ఇస్లామీయ ప్రభుత్వం వివిధ రాష్ట్రాలుగా విభజించబడిన తరువాత ఆయా రాష్ట్రాల గవర్నర్‌లు నివశించడానికి ప్రభుత్వ భవనాలు నిర్మించబడ్డాయి. ప్రజల సౌకర్యం కోసం రోడ్డులు, వంతెనలు, మసీదులు నిర్మించబడ్డాయి. సైనిక అవసరాల కోసం కోటలు, స్థావరాలు, బ్యారక్స్‌లు నిర్మించబడ్డాయి. ప్రయాణీకుల కోసం అతిథి గృహాలు కూడా నిర్మించబడ్డాయి. ప్రభుత్వ ఖజానాల భద్రత కోసం ప్రతి రాష్ట్రంలో బైతుల్ మాల్ (ప్రభుత్వ ధనాగార) భవనాలు నిర్మించబడ్డాయి. హజ్రత్ ఉమర్ (రజి) పాలనా కాలంలో నాలుగు వేల మసీదులు నిర్మించబడ్డాయి.

మక్కా, మదీనాల మధ్య ప్రజల సౌకర్యం కోసం విడిది గృహాలు, నీటి కొలనులు, తయారు చేయబడ్డాయి. వ్యవసాయదారుల కోసం నీటి పారుదల కాలువలు త్రవ్వించబడ్డాయి.

ఈ విధంగా హజరత్ ఉమర్ (రజి) అనేక ప్రజాసంక్షేమ ప్రాజెక్టులు చేపట్టి పనులు చేయించారు.

## పట్టణాభివృద్ధి

హజరత్ ఉమర్ (రజి) కాలంలో ఎన్నో పట్టణాలు స్థాపించబడ్డాయి. ఆ పట్టణాలు ఈనాటికీ చరిత్రలో ఖ్యాతి గాంచి ఉన్నాయి.

బస్రా: హజరత్ ఉమర్ (రజి) అనుమతితో ఉతబా బిన్ గజ్వాన్, ఈ పట్టణాన్ని స్థాపించారు. ప్రారంభంలో ఇక్కడ 800 మంది మాత్రమే జనం

నివసిస్తుండే వారు. కాని కొంతకాలానికే ఈ పట్టణ జనసంఖ్య ఒకటిన్నర లక్షలకు పెరిగింది. విద్యారంగంలో ఈ పట్టణం ప్రఖ్యాతి గాంచింది.

**కూఫ**: పూర్వకాలంలో నోమాన్ బిన్ ముంజిర్ అనే అరబ్బు రాజుకు ఇది రాజధాని పట్టణంగా ఉండేది. కాని కాలక్రమేణ ఆ పట్టణం శిథిలావస్థకు చేరింది. హ్రజత్ సాఅద్ బిన్ అబి వఖ్ఖాస్, హ్రజత్ ఉమర్ (రజి) అనుమతితో ఈ పట్టణాన్ని అభివృద్ధిపరిచారు. హజరత్ ఉమర్ (రజి) సూచన మేరకు పట్టణపు మెయిన్ రోడ్డులను నలుబది బారలు వెడల్పు చేయబడ్డాయి. వాటికన్నా చిన్న రోడ్డులు ముప్ఫయి బారలు, వాటికన్నా చిన్నవి ఇరవై బారలు వెడల్పు చేయబడ్డాయి. జామియ మసీదు ఎంతో విశాలంగా నిర్మించ బడింది. అందులో ఒకే సమయం నలభై వేల మంది నమాజు చేయ వీలుంది. ఈ పట్టణం హజరత్ ఉమర్ (రజి) కాలంలోనే ఎంతో అభివృద్ధి చెందింది. హజరత్ ఇమాం అబూహనిఫా (రహ) ఇక్కడి నివాసియే.

**ఫస్తాత్**: నైలు నదికి, ముఖ్తమ్ కొండకు మధ్య సువిశాలమైన మైదానం ఉండేది. హజరత్ అమ్ర్ బిన్ ఆస్ ఈజిప్టుపై దండెత్తినప్పుడు ఈ మైదానంలోనే ఆయన సైన్యం విడిది చేసింది. అప్పుడు యాధృచ్ఛికంగా ఒక పావురం వచ్చి ఆయన గుడారంలో గూడు కట్టుకుంది. సైన్యం ఆ మైదానం వదలి ముందుకు సాగినప్పుడు హ్రజత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) పావురాయి గూడు పాడవకుండా ఉండేందుకు ఆ గుడారాన్ని అలాగే వదలి వెళ్ళారు. ఈజిప్టును జయించిన తరువాత ఆయన ఆ ప్రదేశంలోనే ఒక పట్టణం నిర్మించారు. ఆ పట్టణానికి ఫస్తాత్ అని పేరుపెట్టారు. అరబ్బీ భాషలో ఫస్తాత్ అంటే గుడారమన్నమాట. తరువాత ఆ పట్టణం అతి శీఘ్రంగ అభివృద్ధి చెంది ఈజిప్టు రాజధానిగా మారింది.

**మూసిల్**: ప్రారంభంలో ఇదొక సాధారణ గ్రామం. హజరత్ ఉమర్ (రజి) దీనిని మహోన్నతంగ తీర్చిదిద్దారు. ఈ పట్టణం ప్రాక్పశ్చిమదేశాలను కలుపుతుంది కనుక దీనిపేరు మూసిల్ అని పెట్టబడింది.

**జీజా**: సికింద్రియాను జయించిన తరువాత అమ్ర్ బిన్ ఆస్‌కు ఒక అనుమానం తట్టింది. రవి నది వైపు నుండి ఈ భూభాగంపై శత్రువులు

దండెత్తే ప్రమాదం ఉందని భావించారు. అంచేత దాని రక్షణ కోసం కొందరు సైనికుల్ని నదీ తీరాన పెట్టారు. సైనికులకు ఆ ప్రదేశం నచ్చినందున వారక్కడే స్థిరపడ్డారు. హజరత్ ఉమర్ (రజి) హిజ్రీశకం 21లో అక్కడ ఒక కోట నిర్మించారు. అక్కడ కాలక్రమేణ ఒక పట్టణం ఉనికిలోకి వచ్చింది. దానికి జీజా అని పేరుపెట్టబడింది.

## ఉమర్ (రజి) సంస్కరణలు

హజ్రత్ ఉమర్ (రజి) తన పరిపాలనా కాలంలో ఈ క్రింది విషయాలను కొత్తగా ప్రవేశపెట్టారు.

1. బైతుల్‌మాల్‌ను (ప్రభుత్వధనాగారాన్ని) శాశ్వతంగా నెలకొల్పారు.
2. న్యాయస్థానాలు స్థాపించారు. తీర్పులు చేయడానికి ఖాజీల (న్యాయమూర్తుల)ను నియమించారు.
3. హిజ్రీశకం తేదీ, నెల, సంవత్సరాల లెక్క నిర్ణయించారు.
4. అమీరుల్ మోమినీన్ బిరుదు పొందారు.
5. సైనిక, రెవెన్యూ కార్యాలయాలను స్థాపించారు.
6. భూములను సర్వే చేయించారు, నీటి సౌకర్యం కోసం కాలువలు త్రవ్వించారు.
7. జనాభా గణాంక పద్ధతిని ప్రవేశపెట్టారు.
8. క్రొత్త క్రొత్త పట్టణాలను నిర్మించారు.
9. మొత్తం దేశాన్ని వివిధ రాష్ట్రాలుగా విభజించి, వాటి పాలన కోసం గవర్నర్లను నియామించారు.
10. జైళ్ళను నెలకొల్పారు. దేశ బహిష్కరణ శిక్ష ప్రవేశపెట్టారు.
11. పోలీసు శాఖను తెరిచారు.
12. నిరుపేద క్రైస్తవులు, యూదులకు పించన్లు మంజూరు చేశారు.
13. పాఠశాలలు స్థాపించారు.

14. తరావీ నమాజ్ సామూహిక పద్ధతి ప్రవేశపెట్టారు.
15. విదేశాల నుండి వచ్చే సరుకుపై సుంకం, వ్యాపార గుఱ్ఱాలపై జకాత్ ప్రవేశపెట్టారు.
16. వివిధ పట్టణాలలో అతిథి గృహాలను నిర్మింపజేశారు.
17. సైనిక స్థావరాలు, బ్యారక్స్ నిర్మింపజేశారు.
18. వార్తాహరులను నియమించారు.
19. ఫజ్ర్ నమాజ్ అజాన్ (పిలుపు)లో "అస్సలాతు ఖైరుమ్మినన్నౌమ్" (నిద్రకంటే నమాజ్ శ్రేష్ఠమైనది) అనే వాక్యాన్ని అదనంగా చేర్చారు.
20. మసీదులో ఉపన్యాసం ఇచ్చే పద్ధతి ప్రవేశపెట్టారు.
21. మసీదుల్లో రాత్రిపూట దీపాలను వెలిగించే ఏర్పాటు చేయించారు.
22. వక్ఫ్ ఆస్తుల పరిరక్షణ పద్ధతి ప్రవేశపెట్టారు.
23. ఉపాధ్యాయులకు, ఇమాములకు, ముఅజ్జిన్‌లకు జీతాలు నిర్ణయించారు.
24. మద్యపానం శిక్షను 80 కొరడా దెబ్బలకు పెంచారు.
25. ఖుర్‌ఆన్ (సూరాల) కూర్పు చేయించమని హజ్రత్ అబూబకర్ (రజి)కు మారుమారు చెప్పి ఆ పని చేయించారు.
26. కవులు తమ కవితల్లో ఎవరిని నిందించ కూడదని, స్త్రీలను గురించి ప్రస్తావించకూడదని ఆంక్షలు విధించారు. ఆంక్షలను ఉల్లంఘించే వారికి శిక్ష కూడ నిర్ణయించారు.

## హజ్రత్ ఉమర్ (రజి) సూక్తులు

హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు:

- ఎవరైతే నమాజును కాపాడుకుంటాడో అతడు తన ధర్మాన్ని కాపాడుకున్నట్లే.

- పరలోకంలో గౌరవప్రదమైన జీవితం గడపదలచుకుంటే ఇహలోకంలో సత్కార్యాలు చేయండి
- అల్లాహ్‌కు భయపడండి, ఆయనపైన్నే భారం వేయండి. ఇది చాలు ముస్లింలకు.
- అల్లాహ్ సన్నిధిలో మన సదాచరణలే మనకు పనికొస్తాయి. పేరు ప్రతిష్ఠలు, వంశమర్యాదలు పనికి రావు.
- ఇతరుల తప్పులను క్షమించనివాడ్ని అల్లాహ్ కూడా క్షమించడు.
- మనిషి పాటించే నమాజు, ఉపవాసాలను చూడకండి, అతని మాటలు చేతలు మాత్రమే చూడండి.
- అత్యంత శ్రేష్ఠమైన సంపద ఆత్మసంతృప్తే.
- విద్యలేనిదే గొప్పతనం రాదు.
- అతిథి సత్కారం మనిషి ఔన్నత్యాన్ని పెంచుతుంది.
- హద్దుమీరిన పరిహాసం వల్ల మనిషి గౌరవం తగ్గుతుంది.
- ఈ రోజు చేయవలసిన పనిని రేపటికి వాయిదా వేయకండి.
- వెనుకేసిన అడుగు ఇక ముందుకు సాగదు.
- చెడును గుర్తించండి, లేకుంటే ఆ చెడులో మీరూ కూరుకుపోవచ్చు.
- ఇతరుల తప్పులు ఎత్తిచూపే ముందు తమ తప్పులేమిటో చూసుకోవాలి.
- సహనం వహించండి, ప్రశాంత జీవితం గడుపుతారు.
- ఈర్ష్య పడకండి, దానివల్ల విరోధభావం జనిస్తుంది.
- నా లోపం ఏమిటో నాకు ఎత్తి చూపేవాడికి దైవం మేలుచేయుగాక!
- పశ్చాత్తాపం చెందేవారి సాంగత్యంలో కూర్చోండి. వారి హృదయాలు మెత్తబడి ఉంటాయి.

- ఇతరుల కోసం తన పరలోక జీవితాన్ని నాశనం చేసుకునేవాడే అందరికంటే పెద్ద మూర్ఖుడు.
- పాపకార్యాలు తక్కువగా చేయండి, మరణబాధ తేలికవుతుంది.
- మరణించిన మీ తండ్రిగారి స్నేహితుల పట్ల సద్భావంతో మెలగండి; మీ జీవితం సార్థకం అవుతుంది.
- ఇతరుల విషయంలో అతి శ్రద్ధకు పోయి మిమ్మల్ని మీరు మరచిపోకండి.
- ఏ పాలకుని కారణంగా అతని ప్రజలు నీతి తప్పుతారో అతనికంటే నికృష్ట పాలకుడు మరొకడుండడు.
- మీరు మీ సోదరునికి ముందుగా సలాం చేయండి. సమావేశంలో అతని కోసం స్థలం వదలండి. అతణ్ణి మంచి పేరుతో పిలవండి. వీటివల్ల అతని హృదయంలో మీపట్ల గౌరవాభిమానాలు జనిస్తాయి.

అల్లాహ్ మనకు ఈ హితబోధనల ప్రకారం జీవితం గడిపే సద్బుద్ధి ప్రసాదించుగాక!

-: సమాప్తం :-